# మనస్స్వాతంత్ర్యము

## ప్రథమ భాగము

# Rationalistic Free Thought

## PART I



వల్లూరి సూర్యనారాయణరావు

బి.ఏ., బి.యల్. యల్. టి.

హైకోర్టు అడ్వకేటు

కొవ్వూరు

TO

The Sacred Memory

OF

My Beloved Son

**Valluri Rama Mohun**

Who, but for his premature demise would have been of great help to me in my research work, with his knowledge of Sanscrit, English, Hindi and Urdu and his earnestness for truth, honesty and free thought.

This little book is lovingly dedicated.

# ఉపోద్ఘాతము

కొన్ని పాశ్చాత్యుల గ్రంథములను, మన మతగ్రంథములను, కొంతవరకు పరిశీలించి యిటీవల నేను ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికలలో వ్రాసిన వ్యాసముల నిందుచేర్చితిని. కావున, వీనిలో సహజముగ కొన్ని చర్వితచర్వణము లుండకతప్పవు. నాకంటెభౌతికశాస్త్రములలోను, పూర్వమతగ్రంథములలోను యెక్కువ అనుభవము కలవారు, యీ గ్రంథాంతమందున్న పట్టికలోని విషయములను గురించి, సంపూర్ణమనస్స్వాతంత్ర్యముతో, సత్యము తప్పకుండ ఆంధ్రములో చిన్నచిన్న గ్రంథములను వ్రాసి పంపుచున్నయెడల, యీ కొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠసంఘమువారు, వానిలో యుక్తమని యెంచినవానిని సర్వస్వాతంత్ర్యములతో తామే అచ్చువేసికొని తమ స్వంతఖర్చుతో ముఖ్యమైన ఆంధ్రగ్రంథాలయములకన్నిటికిని ఉచితముగా పంపుచుందురు—

ఇంద్రియగోచరమగు యీ ప్రకృతియనెడు తెరచాటున యేమున్నది, ప్రపంచములోని వేదాంతు లెవరును తెలిసికొనజాలనపుడు, మనమనగా నెంతవారము? మతములని వాడబడు సంస్థలలోని మూఢవిశ్వాసములను, ఆచారములను, ఆధునిక భౌతికశాస్త్రములు తమ ప్రత్యక్షప్రమాణము

లతో వెనుకకు క్రమక్రమముగా నెట్టివేయుచున్నవి. జన సామాన్యములో కొందరైనను, కొంతకాలమునకైనను అట్టి విశ్వాసములను తొలగించుకొనెదరని నమ్మువారిలో, నేనొక డను. ముఖ్యముగా మన హైందవసంఘములో, భగవద్గీత, ఉపనిషత్తులు మొదలగు వేదాంతగ్రంథములందు ప్రతిపాదింపబడిన భక్తిజ్ఞానకర్మయోగములలో యేవిధానము యెవరి మనస్సునకు నచ్చునో, వారు దానిని ఆచరణలో పెట్టుకొనవచ్చును. వీరినిగాని, ఆయా శిద్ధాంతములనుగాని నేను విమర్శించదలచలేదు. కాని, వీరూహించుకొను మోక్షమునకు యెట్టి యాటంకములను కలుగజేయనప్పుడు, ప్రకృతిరహస్యములకు కేవలము వ్యతిరేకముగనున్న మూఢమతవిశ్వాసములను, అభూతకల్పనలను, పిట్టకథలను నిలవబెట్టుటకు మన పూర్వాచారపరాయణులుచేయు విపరీతార్థములు, రహస్యార్థములు, అపురూపవాదనలు కఠినముగ విమర్శించక తప్పదు. ఇట్టి విమర్శనకు యీచిన్ని పొత్తము కొద్దిగానైనను తోడ్పడవచ్చుననియు, ప్రజలలో మనోబానిసత్వము కొంతవరకైనను తొలగవచ్చుననియు నమ్ముచున్నాను.

వల్లూరి సూర్యనారాయణరావు.
సెక్రిటరీ
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము
కొవ్వూరు ; పశ్చిమగోదావరిజిల్లా.

# "THE DECLARATION OF THE FREE"

1. We have no falsehoods to defend, we want the facts;
   Our force, our thought, we do not spend in vain attacks;
   And we will never meanly try
   To save some fair and pleasing lie.

2. The simple truth is what we ask, not the ideal;
   We've set ourselves the noble task to find the real.
   If all there is nought but dross,
   We want to know and bear our loss.

3. We will not willingly be fooled by fables nursed;
   Our hearts, by earnest thought, are schooled to bear the worst;
   And we can stand erect, and dare
   All things, all facts that really are.

4. We have no God to serve or fear, no Hell to shun,
   No Devil with malicious lear, when life is done;
   An endless sleep may close our eyes,—
   A sleep with neither dreams nor sighs.

5. We do not bow before a guess, a vague unknown;
   A senseless force we do not bless in solemn tone.
   When evil comes we do not curse,
   Or thank because it is no worse.

6. When cyclones rend, when lightning blights'tis naught but fate;
   There is no God of wrath who smites in heartless hate.
   Behind the things that injure man
   There is no purpose, thought or plan.

7. We waste no time in useless dread, in trembling fear;
The present lives, the past is dead and we are here,—
All welcome guests at life's great feast ;
We need no help from ghost or priest.

8. We love our fellow-man, our kind—wife, child and friend ;
To phantoms we are deaf and blind ; but we extend
The helping hand to the distressed ;
By lifting others we are blessed.

9. We love no phantoms of the skiss, but living flesh
With passion's soft and soulful eyes, lips warm and fresh,
And cheeks with health's red flag unfurled,
The breathing angels of this world.

10. The hands that help are better far than lips that pray
Love is the ever gleaming star that leads the way,
That shines, not on vague worlds of bliss,
But on a paradise on this.

*—Col. Robert G. Ingersoll.*

Do what thy manhood bids thee do,
From none but self seek applause
He noblest lives and noblest dies
Who makes and keeps his self-made laws.
All other life is living death
A world, where none but phantoms dwell
A breath, a wind, a sound, a voice
A tinkling of the Camel—bell.

*—Sir Richard Burton.*

"Truth is God"—Mahatma Gandhi.

# విషయసూచిక.

# మనస్స్వాతంత్ర్యము

## వ్యక్తి మనస్స్వాతంత్ర్యము

### 1 వ అధ్యాయము

మనచుట్టూ, వ్యక్తిమనస్స్వాతంత్ర్యమునకు భంగము కలిగించువారనేకులున్నారు. మనము ఉయ్యాలలో నున్నపుడే ఆచారపిశాచము మనలను పట్టుకొని, మన శరీరములు దహన మగువరకు, వదలదు. మనము చిన్నతనములో వేయు ప్రశ్నలకు, అవివేకదేవత జవాబు లిచ్చుచుండును. చనిపోవు చున్నపుడు వేయువానికి, మూఢవిశ్వాసదేవత జవాబు లిచ్చును. మన కభిమానములేని యెన్ని విషయములలోనైనను, మనము అధికసంఖ్యాకులతో నేకీభవించకపోయినను, బాధ కరముకాదు గాని, ప్రజాసామాన్యములో వాడుకయందున్న మూఢవిశ్వాసములను గురించి మృతులైనవారి సాక్ష్యము నకు మన మడ్డుతగులగూడదట! దానిని వేదవాక్యములుగ నమ్మవలసినదే.

విధేయత, అవిధేయతలు రెండును కూడ మానవాభి వృద్ధికి అవసరములే. ప్రపంచచరిత్రలో యేపుటనైనను తెరచి

చదువుడు. ఎట్టి స్వకీయాభిప్రాయము లేక, విధేయులుగా అందరు మనుజులున్న యెడల, యెట్టిఫలములు కలిగియుండునో ఆలోచించుకొనుడు. మన మనోభావముల నరికట్టుటకు మత గురువుల కధికార మిచ్చియున్నను, జ్యోతిష్కులకు మన ఖగోళశాస్త్రమును ఒప్పచెప్పియున్నను, రాజులను, పరిపాలనా విధానము నేర్పరచ నిచ్చియుండినను, వైద్యశాస్త్రమును, వైద్యులకే వదలివేసి యుండినను, మన మందరము, పూర్వ కాలపు చీకటిలో నుండెడివారమే. వేదాంతముగాని, భౌతిక శాస్త్రములుగాని మొలకలెత్తకనే పోయి యుండును. అట్లు కాక, పూర్వసాంప్రదాయములకును, పట్టుదలతో నాచరింప బడు ఆచారములకును, కొందరైనను అవిధేయతను, స్వకీయ స్వతంత్రాలోచనలతో కనుపరచి యుండుటచేతనే ప్రస్తుత నాగరికతాభివృద్ధికి కారణ మైనది.

ఇప్పటికైనను, ఒక వ్యక్తి యెంత పూర్వకాలపువా డైన అతనిమాట లంత యెక్కువగ విశ్వసనీయములని, ప్రజలలో ఒక పిచ్చియభిప్రాయము వ్యాపించియున్నది. తమ పూర్వులే, వివిధమానవసంఘములలో, నేటికిని ప్రథమస్థానము నాక్రమించి యున్నారనియు, వారి యాజ్ఞలను మనము జవ దాటకూడదనియు వీరి తలంపు. ఇట్లు ప్రతిసంఘమువారును, తమ పూర్వమతగ్రంథములే, దైవదత్తములనియు, తక్కిన సంఘములవారి వన్నియు అబద్ధములనియు, తలచెదరు. ఇదియే వీరి దేశాభిమానమునకు ముఖ్యాంకురము. అహం

కారజన్యము. పశితనమునందే, ఉగ్గుపాలతో వారికి చేసిన యీ బోధన, సాధారణముగా జీవితాంతమువరకు వారిని విడువదు. తల్లి చెప్పిన పిట్టకథ లన్నియు నిజమని యెంచి ఆమె చదువుచుండిన పుస్తకమును, తాను కూడ చదువక మునుపే, దానిలోని విషయముల నన్నియు సత్యములని నమ్మి తాను దానిని చదువుటకు శక్తిగలవాడైనపుడు, యెట్టి విమర్శనను చేయకనే దానిలోని విషయములను నమ్ముచుం డును. ఈ కారణముచేత, మన విమర్శనజ్ఞానమునకు, చిన్న తనమునుండియు యీ నమ్మకము అడ్డుతగులుచునే యుం డును. ఈ మూఢవిశ్వాసము, మనము బాలురముగా నున్న పుడే, మన మనఃఫలకములమీద నానావిధమైన అసత్యము లను వ్రాయుచుండును. వీనిని మనము పెద్దవార మైనపుడు కూడ విమర్శనజ్ఞానము వృద్ధియగుచున్నను, వానిని గీకివేయు టకు అశక్తుల మగుట సంభవించుచుండును. తెలివితక్కువయు మూఢవిశ్వాసములును గల మన తల్లుల తరువాత, మన ఉపాధ్యాయులు నిందార్హులు. తమకు లోలోన సందేహించు విషయములు కూడ, సత్యము లైనట్లు మనకు బోధచేయు దురు. బాలుని సహేతుకాన్వేషణజ్ఞానము నుపయోగించ నీయక, తమ యాజ్ఞల ననుసరించి, వానిని నమ్మడని నిర్బం ధించెదరు. వీరు, ఒక మతమనుదానిని అవలంబించునట్లు చేయుదురుగాని, బాలుర విమర్శనజ్ఞానమునకు సావకాశము లిచ్చి, దానిని వృద్ధిచేయుటకు ప్రయత్నించరు. నిజమైన

పురుషులుగను, స్త్రీలుగను, వారు చేయజాలరు.

నిరంకుశాధికారదేవత, రాజ్యపరిపాలనలోను, మత బోధలోను మనస్స్వాతంత్ర్యము నుపయోగించి దాని కడ్డు పెట్టువారిని అసహ్యించుకొని బాధించుచు, తన్ను పూజించు వారిని, పొగడువారిని, తన అనుచరులను యెట్లు ప్రేమించునో, అట్లే మూఢవిశ్వాసదేవత కూడ తనయందు నమ్మకముగలవారిని, తన శిష్యులను నెత్తిమీద పెట్టుకొనును. దొంగకు, పోలీసువారి కెట్లు భయపడుటకు కారణము లుండునో, మన మతాచార్యులకు కూడ, సంశయాత్ములను గురించి, అంతగా భయము కలుగుచుండును. ఏవ్యక్తికిగాని, యేదేవతకుగాని యీయకూడని పూజను, తనకు సమర్పించుమని యీ మతదేవత సదా కోరుచుండును. ఒకరిని పూజించుట, తన గౌరవమును నశింపజేసికొనుటయే. గౌరవించుట వేరు. పూజించుట వేరు. పూజ యనునది భయమువలన జనించునదిగాని, స్వభావసిద్ధమైనది కాదు. కోరికలు ఫలించును నాశవలన యిట్టి పూజ పెరుగుచుండును. ఇట్టి పూజయే, ఒకరిని అందలముమీద నెక్కించి, అనేకమందిని అగౌరవపరచును. దొంగలకును, అసత్యవాదులకును రాచనగరులు, శిలాప్రతిమలు కల్పించి, వానినిపూజించువారు, తమ చేతులకు తామే అరదండములను వేసికొనుచున్నారు. ఇట్టివారే, తమ్మును కూడ యిట్లు యితరులు పూజించవలెనని కోరెదరు. అధికారదేవతయొక్క ఆజ్ఞలను, యెట్టి విమర్శనలేకుండ

గనే శిరసావహించువారు, తమ వ్యక్తిత్వమును పోగొట్టుకొని పశువు దానికంటె భిన్నమగు తమ మానవజ్ఞానమును, అధః పాతాళమునకు త్రొక్కివేయుచుందురు.

మతాచార్యుడు తన మతాచారమును సమర్థించుచుండును. భగవంతునికి తానే ముఖ్యదూతననియు, మానవకోటికంతకును, యెప్పటికిని తానే ఆలోచన కర్తననియు, తనమత గ్రంథమే సత్యముగనుక, దానినే నమ్మవలెననియు చెప్పువాని యహంభావమును గురించి మన మేమనవలయును? మన మేధాశక్తిని తనకు బానిసనుగా చేసికొనుటకు యీయనకు హక్కు యెవరొసంగిరి? ఏ విషయమైనను, ప్రత్యక్ష ప్రమాణమువలన ఋజువు పరచగలిగిన యెడల, బలాత్కారమవసరమే లేదుకదా! ఋజువు పరచ జాలనపుడు, దానివలన యెట్టిలాభము లేదుకదా! ప్రతిమతగురువు సత్యాన్వేషణమును బొత్తిగా వదలివేసి, ఒక సాంప్రదాయమును నిలబెట్టుటయే తన ధర్మమని యెంచును.

మన హిందువులలో, యిప్పుడు జనసామాన్యముచేత అవలంబింపబడుచున్న మతవిధానము, కేవలము ఊహాప్రపంచము మీద నాధారపరచబడిన మనపూర్వ ఋషులవేదాంతము కాదు. కర్మకాండ, కొన్ని మతవిశ్వాసములు, కొన్ని తంతులు, పూజలు, దేవతలు, దయ్యములు, యజ్ఞములు, యాగములు, దేవాలయములు, ప్రతీకములు, అవతారములు, వర్ణాశ్రమధర్మములు, సాంఘికాచారములు, పుక్కిటిపురాణే

తిహాసములు, మొదలగువానితో నిండిన ఒకమతము—దీనికి తలయు తోకయు లేదు. వీనిని సమర్థించుటకు, అనేకమత గురువులు మనచుట్టూ ఉండి, మనల నాశ్రయించుకొని జీవించుచున్నారు. మన స్త్రీలు ముఖ్యముగా వీరిచేతులలో కీలుబొమ్మలు. మనము మనస్త్రీల చేతులలో కీలుబొమ్మలము. ఈ మూఢ విశ్వాసములే మనసంఘమును పీల్చి పిప్పిచేయుచు మనస్స్వాతంత్ర్యమను దానిని పెరుగనిచ్చుటలేదు. దీనిమేరలను దాటినప్పుడు గాని, మనసంఘము నిజమైన యభివృద్ధిని పొందదు. మనస్స్వాతంత్ర్యమును పోగొట్టుకొన్నవాడు, ఆత్మపోయి, బ్రతికియున్న శవమువంటివాడు. ప్రతిదేవాలయము స్మశానవాటికవంటిదే. ప్రతిమతము, మృతినొందినవాని గోరీమీద లిఖించిన వ్రాతయే. విచక్షణజ్ఞానము లేక పరులను యనుకరించుటయు వారు చెప్పునదంతయు విశ్వసించుటయు కంటె బానిసత్వము వేరే లేదు. మనహేతువాదనశక్తియే మనకు ముఖ్యప్రమాణము. దీనిననుసరించి నడచువాడు, ఒకప్పుడు తప్పుత్రోవను పడవచ్చును కాని యిది తప్ప వానికి మరియొక ప్రమాణముండనే కూడదు. అతని అనుభవము వలననే, తనపొరబాట్లు సవరించుకొనవలయును. తన దుర్నడతవలనను, అనాలోచనవలనను, కలిగినఫలముల ననుభవించుచు సన్మార్గమేదియో తెలిసికొనుచుండును. ఈ విచక్షణ శక్తియు, అనుభవములే, అతని కన్నులను తెరచగల సాధనములు. దీనిని వదలినయెడల తనకంటె అజ్ఞానులగు వారిని

యనుకరించుట సంభవించి, వారు బోధించునది యంతయు సత్యమని నమ్ముచుండును. కాబట్టి తన హేతువాదముచే యింగితజ్ఞానమును వృద్ధిచేసికొని, దానినిబట్టియే తన నడతను సవరించుకొనవలెను గాని, యే గ్రంథమునుగాని, యే వ్యక్తిని గాని పరమప్రమాణముగ నెన్నటికిని నమ్మకూడదు. మతములను నవియే, యిదివరకును, యిప్పుడును అనేకులను బానిసలుగ చేయుచున్నవి. వీనికి తలయొగ్గవలదు. వీని వలలలో పడినవారికి విచారణశక్తి నశించును.

---

## ఏ మా ర్గ ము ?

### 2 వ అధ్యాయము

I మానవులకు రెండు త్రోవ లున్నవి. (1) స్వాభావికమైనది. (2) అస్వాభావికమైనది. మనము యీ ప్రపంచము కొఱకు బ్రతుకవలెనన్న, విద్య వలనను విమర్శనలవలనను, మన జ్ఞానమును అభివృద్ధిపరచుకొనుట, ప్రకృతిలోని శక్తులను లోబరుచుకొనుట, మనము, మంచికూడు, గుడ్డ యిల్లు మొదలగు సౌకర్యముల నొనగూర్చుకొనుట, శాస్త్రపఠన పరిశోధనలతో మన జ్ఞానపిపాసను చల్లార్చు

కొనుట,—యిది యొక మార్గము. మనము, ముందెన్నడో సౌఖ్యము పొందగలమని యూహించుకొని, మరియొక ప్రపంచము కొరకు జీవించుట, దానికొరకు యీ భౌతిక జీవమును త్యాగము చేయుట, మన ప్రార్థనల వలనను, జపములు, మొదలగు కర్మకాండల వలనను, సమస్త కోరికలు సఫలమగుచుండునని నమ్ముచుండుట, రెండవ మార్గము. మొదటి మార్గములో మనకు ఆలోచన, విమర్శనము, హేతువాదన లుండును. రెండవ మార్గములో యితరులకు విధేయులమై వారు చెప్పినట్లు నడచుకొనుట, తన పంచేంద్రియములు విమర్శన జ్ఞానము ప్రమాణములుగ నంగీకరించక, తమ కేమో ఆముష్మిక విషయములు తెలుసునని విర్రవీగువారికి సాష్టాంగము చేయుట, సదా కనుపడుచుండును. నీ మానవ సోదరులను, నీ భార్యా బిడ్డలను, ప్రేమించుచు, వారి కష్టముల నివారించి, వారి సౌఖ్యము కొరకు జీవించుట ఒక మార్గము. వీ రెవరును తనవెంట పరలోకమునకు రారు గనుక, తన మోక్షము కొరకు తానే స్వార్థముతో ప్రయత్నించవలెననుట, తనకు మరియొక ప్రపంచములో ఉపకారము చేయుదురని దయ్యములు దేవతల కొరకు జీవించుట, మరియొక మార్గము. మొదటి మార్గములో నీకు గల చిన్న దీపముతోనైనను కొంత వెలుతురులో నడచెదవు. రెండవ మార్గములో, ఆ స్వల్ప వెలుతురును కూడ ఆర్పుకొని, మరియొకరి అడుగు జాడలను బట్టి గ్రుడ్డిగా పోవుచుందువు. నీ స్వగౌర

వమును విడచి, యితరులకు బానిసవై, నీవు అనుభవించ జాలని మనస్స్వాతంత్ర్యమును, యితరులకు కూడ లేకుండు టకు సదా ప్రయత్నింతువు—ఇట్లు వ్రాయుట మన పూర్వు లను నిందించుటకు కాదు. వారికి గోచరించునంతవరకు సదుద్దేశ్యముతోనే గ్రంథములు వ్రాసిరి. వారు, అస్వాభా వికమైన దానిని నమ్మి, తమ ప్రార్థనలు యాగములు, ఉపవాసములు మొదలగు వానివలన, తమకు, యెండలు, వానలు, పంటలు ఆయుష్యము శాశ్వత సుఖము మొదలగునవి కలుగచేయునని వారిభ్రమ. జల ప్రళయములు, తుపానులు, భూకంపములు, అగ్నిపర్వతజ్వాలలు, సాంక్రామిక వ్యాధులు మొదలగునవి భగవంతుడు, తమరు చేసికొన్న పాపములకు కల్పించిన శిక్షలని యెంచిరి. తమకు సౌఖ్య మును కలుగచేయునవి ప్రకృతిలో సంభవించునపుడు, తమ పుణ్యావశమున, తమ కిచ్చిన బహుమతులని సంతోషించిరి. ఇవి యన్నియు ప్రకృతియొక్క లక్షణములని వీరు విశ్వ సించరు.

II మన జీవితమును గురించి, వేల సంవత్సరముల నుండి రెండు వేదాంతమార్గములు బయలుదేరినవి:— (1) మన యింద్రియములను నిగ్రహించుట, కోరికలను తగ్గించుట, మనకు కనుపడని ఒక శక్తిమీదనే యాధారపడుట (2) అతి చపలత్వము లేకుండ యింద్రియములను తృప్తిపరుచుకొనుట, కోరికలను వృద్ధిచేసికొనుట, వీనికొరకు కృషి, వాణిజ్యము,

నూతన పరిశోధనలను, చేయుచుండుట, తనశరీర మనోదార్ఢ్యములమీదనే తానాధారపడుట. మొదటిమార్గమును బుద్ధుడు యేసుక్రీస్తు మనవేదకాలపు ఋషులు, మొదలగు మతాచార్యులుపదేశించిరి. వీరు కాంచనకనకములను అసహ్యించుకొనువారు. మంచిబట్టలు, మంచిభోజనము, మంచియిండ్లు,వీరికి గిట్టవు. దీని పేరు చింపిరిగుడ్డ వేదాంతము. ధనవంతులకు నరకమును, దరిద్రులకు స్వర్గమును చూపించెదరు. ఈ వేదాంతము క్రమక్రమముగా వెనుకకు నెట్టబడుచున్నది. ప్రజలు యీ ప్రపంచములోనే సకలసౌఖ్యముల ననుభవించదలచుకొన్నారు. నిరశనవ్రతము నందును, శరీరశోషణమందును నమ్మకము తగ్గినది. పైనుండు పరాత్పరునియొక్క బహుమతులను, శిక్షలను నమ్మరు. తమకార్యాచరణఫలితములందే విశ్వాసముంచెదరు. జ్ఞానసముపార్జనము వలననే, మనకు సంభవించు కీడులను తొలగించుకొనవలెనని నమ్మెదరు కనుక తమ మేధాశక్తిమీదనే యాధారపడుచున్నారు. తుదకు ఖద్దరు కట్టుట, భోగములను త్యజించుట, మొదలగువానితో నిరాడంబర జీవనమే ముఖ్యమని కొందరు నమ్ముచున్నను, యిదియంతయు తమ బీదసోదరుల సేవకే తోడ్పడుననిగాని, దీనివలన తమకు పరలోకములో మోక్షము వచ్చునని కాదు.

III రాజ్యపరిపాలనా విధానములో కూడ రెండు మార్గములున్నవి. (I) పూర్వ మతసాంప్రదాయములను బట్టి రాజు విష్ణుసంభూతుడు గనుక, అతని యాజ్ఞల నెన్నటికిని

మీరక, దోసిలొగ్గవలయును. మన మతగురువులు కూడ వారికే సహాయపడుదురు. వీరు, పరమేశ్వరునివలన సూటిగా, మతసూత్రములను తెలిసికొనిరిగాన, వానిని తప్పక మనము నమ్మవలసినదే. వారి తరువాత వచ్చినవారికి, ఆయన యెట్టి నూతనమతసూత్రములను, కూడ కాలానుసారముగ, బోధించ లేదు. ఆయూజాతిలోని నాయకులకు ఒక్కసారియే, అనేకవేల సంవత్సరములక్రింద, ప్రళయాంతమువరకు ఆచరించుటకు తగిన వనిన్ని, ఆచరించవలసి యుండుననిన్ని వానినిఆయనకొన్నిటిని శృతపరచినాడు. ఏ జాతి కాజాతి తన శ్రుతులే ప్రపంచమున కంతకు ప్రమాణములుగాని, యితరుల శ్రుతులు ఒట్టిబూటకము లని వాదించును. (2) ఒక మతగురువు, దేవుడు, రాజు మొద లగు వారి యవసర మెంతమాత్రమును లేకయే రాజ్యపరిపా లన జరిగించుకొనుటకు, ప్రతిజాతియు ప్రయత్నించుటయేగాక పలుచోట్ల ప్రజాపరిపాలనమే యేర్పరుచుకొని జయమును బడయుచున్నారు. దేవుళ్ళను, దేవతలను, దయ్యములను, ప్రపంచవ్యవహారములలో యేవిధమైనజోక్యము కలుగజేసి కొనకుండ దూరముగ తరిమివేయుచున్నారు. మతములలో స్వయంవ్యక్తిత కవకాశమే లేదని నమ్ముచున్నారు.

IV. రోగములు, వాని పుట్టుకకు కారణములను గురించి, రెండుమార్గము లేర్పడినవి—(1) మతసంబంధమైనది (2) భౌతికశాస్త్రసంబంధమైనది. మొదటి మార్గము ననుస రించి, దయ్యములు, పోలేరమ్మ మొదలగు క్షుద్రదేవత

లనేకములు, మన దేహములలో ప్రవేశించి, విశూచి, మశూచి, ఆటలమ్మ మొదలగు రోగములను తెప్పించుననియు వీనిలో కొన్ని మన పురాకృతకర్మవలన కలిగిన వగుటచే, యెవరిని ప్రార్థించినను, గొప్పడాక్టర్లను తెప్పించినను, మనము వానిని అనుభవించి తీరవలసినదే యనియు, సాధారణముగా, దైవప్రార్థనలు, ఉపాసనలు, వ్రతములు, నవగ్రహజపములు, మంత్రములు, మ్రొక్కుబళ్లు, కోవెలలలోని దేవుళ్ల సందర్శనము, తీర్థసేవలు, ప్రసాదములు, విభూతులు, తాయతులు, బిళ్లలు మొదలగునవి యక్కరకు వచ్చుననియు, మన పూర్వాచారపరాయణుల వాదము. (2) రెండవమార్గము, కాలక్రమమున క్రమేణా కనిపెట్టబడి, దానివెంటనే, అదివరకు మొదటి మార్గము నవలంబించువారు కూడ యిప్పుడు నడుపసాగిరి. శారీరశాస్త్రమును తెలిసిన వైద్యునికి, తమ శరీరములను ఒప్పచెప్పుచున్నారు గాని, పై యుపాయములమీద నాధారపడుటలేదు. ఇంకను, కొందరు తమ యాత్మలను, జ్ఞానమును, మతాచార్యుల చేతులలో నుండి పూర్తిగా లాగివేయలేదు. అయినను యీ మతాచార్యులే, తమకు జబ్బు ప్రవేశించినపుడు, డాక్టర్లకే తమ శరీరమును ధైర్యముగ ఒప్పచెప్పుచున్నారుగాని, తమ మంత్రోపాయముల మీద ఆధారపడుటలేదు.

V మత గ్రంథోత్పత్తికి రెండుమార్గములు కలవు—(1) మతములు, మనపూర్వులలో కొందరి చెవులలో దేవుడు

ఊదిన విషయములని కొందరు నమ్మెదరు. (2) అవి మను
ష్యులవలననే నిర్మింపబడినవనియు, స్వభావశిద్ధముగ, ఆయా
జాతుల పూర్వీకుల నమ్మికలను బట్టియు, అప్పటివారి ప్రకృ
తిని గురించినజ్ఞానమును బట్టియు యేర్పడినవని రెండవవారి
యభిప్రాయము. ప్రతిజాతియు, తనమతమే భగవద్దత్తమనియు,
తక్కినవారి మతములు ఒట్టి మూఢవిశ్వాసములు, మానవ
కల్పితములనియు నమ్ముచుండును. ఈ విషయములో, సత్య
మును నిర్ణయించు వారెవరు ? ఏ జాతిలో, యెట్టి యాచార
ములు, యెంతజ్ఞానమున్నదో వాని కనుగుణముగానే, వారి
వెర్రినమ్మకములను సాంప్రదాయములను, వారి మతగ్రంథము
లలో నిమిడ్చిరి. కాని, యీ జాతులన్నియు, కేవలము యీ
ప్రకృతిలో జరుగు విషయములను చూచుటవలన జనించిన
భయముచేత, ఒక్కడో, లేక పెక్కుదేవతలో ఉన్నారనియు
వారి కోపప్రసాదములకు, మనము లోనుగావలసి యుందుము
గనుక, వారిని తప్పక ప్రార్థించుచుండవలసిన దనియు శాసిం
చుకొన్నవి. ఇప్పుడివి యన్నియు, అభూతకల్పనలనియు, యిట్టి
మతములు పుట్టుట, గిట్టుట, మారుట ప్రకృతిలోని తక్కిన
విషయములవలెనే, స్వభావసిద్ధములే యనియు, ప్రార్థనలు,
దానములు మొదలగునవి వృథాయనియు, వీనిని యే దేవ
తయు స్వీకరించుట లేదనియు, జనులు తెలిసికొనుచున్నారు.
కాని మనకందరకు యిట్టి ప్రార్థనలు చేయుట అలవాటై
పోయినది. మతగురువులకును, పురోహితులకును, అర్చకుల

కును, యిదియొక వృత్తియైనది. మనకోరికలతో యెట్టి సంబంధము లేకనే, ప్రకృతి తన యిష్టము వచ్చినట్లు సంచరించుచున్నదనియు, మేఘములు, గాలి,వర్షము, యెండ, మొదలగునవి, మానవుల కోరికలను లక్ష్యపెట్టక, వాటంతటవి సంభవించుచున్నవనియు మనము తెలిసికొనుచున్నాము. బుద్ధిమంతుడు, ప్రకృతినుండి తప్ప, మరి యే యితరదైవమూలమునను యివి తటస్థించుట లేదని గ్రహించుచున్నాడు. దేవుడను వాడొకడున్నను అతడు మనయిచ్ఛకపు మాటలు, ప్రార్థనలు, నిందలు, మొదలగునవి లక్ష్యపెట్టడనియు, అట్టి పనులవలన ఒక చినుకుబొట్టుగాని, ఒక సూర్యకిరణముగాని రాదనియు, జలప్రళయములు మొదలగునవి రాకుండ చేయలేదనియు, ఘోరయుద్ధముల నాపలేదనియు, దుష్టశిక్షణ, శిష్టరక్షణలు, న్యాయమార్గానుసారముగ యెన్నడు జరుగుచుండలేదనియు, మన కనుభవమువలన స్పష్టపడుచున్నది.

VI నీతియొక్క పునాదులను పరిశోధించుటలో రెండు మార్గములున్నవి— (1) దేవునియాజ్ఞలే నీతిసూత్రములు. ఆ ధర్మములనే అవలంబించవలెను. (2) అనేకపురుషాంతరములనుండి మనకు కలుగుచుండిన ప్రపంచానుభవము, యింగితజ్ఞానము, సాంఘికాభివృద్ధి మొదలగు వానిమీదనే నీతిధర్మము లాధారపడుచున్నవి గాని, మతములతో గాని, ఒక మతాచార్యుడు వ్రాసిన గ్రంథముతో గాని, వీనికెట్టి సంబంధముగాని, ఆ చరణయోగ్యతగాని కలు

గదు. మొదటిమార్గములో దేవుని యాజ్ఞలు, న్యాయమైనవా కావా, యెట్టి సందర్భములలో నైనను మార్చుకొనవచ్చునా కూడదా యను విచారణయే కూడదు. భగవదిచ్ఛయు ఆయన ఆజ్ఞలు మన మతగురువుల గుండా మన కుపదేశింపబడినవి గనుక, వానిని తప్పక శిరసావహించవలెను. ఒక కార్యమును, భగవంతుడు, మతగ్రంథములో చేయకూడదని చెప్పెను గనుక, దానినితప్పుడు పనియందురుగాని, అది తప్పు కార్యము గనుక నే, భగవంతుడు దానిని చేయవలదన్నాడనియైనను యీ మొదటి మార్గమును నడచువారు సమర్థించరు. వారిట్టి న్యాయాన్యాయవివేచనను గురించి తలపెట్టక, తమగ్రంథములలో వ్రాసిన ధర్మములకు మారుమాటాడక వినయవిధేయతలను కనుపరచ మనెదరు, కార్యాకార్యావివేచనలో, మనబుద్ధి నుపయోగించమని చెప్పరు. మీరు కొన్ని కార్యములు చేసినయెడల దేవుడు మిమ్ములను శిక్షించుననియు, కొన్ని చేసిన మిమ్మును బహూకరించుననియు, చెప్పుచుందురు. దేవుడే మనకురాజు. మనమందరము, బానిసలముగనుక, ఆయన యాజ్ఞలను శిరసావహించవలెను. కాబట్టి, ప్రజాసామాన్యము, దేవుని యాజ్ఞలను తెలుపు మతగ్రంథముల యందు నమ్మకముంచని యెడల ప్రపంచములో నీతియే నశించునని, యీ మొదటి మార్గములో నడచువారు పిచ్చి నమ్మకములో మునిగియున్నారు. రెండవమార్గము బట్టినవారు, కార్యా కార్యస్వభావములలోను విషయనిర్ణయములోను వానిఫలములలోను,

నీతి యవి నీతుల తారతమ్య మిమిడియున్నదని వాదించె దరు. కొన్ని కార్యములు, విరివిగా జరిగినపుడు మానవకోటి కంతకును, సౌఖ్యమిచ్చునవిగాగాని లేక దుఃఖమును, బాధను కలుగజేయునవిగాగాని యగుటచేత, సంఘములను స్థిరీకరించి వృద్ధిపొందించుటకు, అనేకలక్షల సంవత్సరములనుండి మానవుడు స్వానుభవమువలన కనిపెట్టిన నీతినియమములనుబట్టి నడచుచున్నాడు. ఈ నీతి యనునది, స్వర్గనరకములను ప్రపంచములతో సంబంధించినది కాదు. ఆదిమధ్యాంతరహితుడగు ఒక వ్యక్తి వేరుగానుండి, మనకు మంచిచెడ్డలు బోధించుచున్నాడని యీ రెండవమార్గము బొత్తిగా ఒప్పుకొనదు. ఒక కార్యము యొక్క నీతి యవినీతులు, కర్తయొక్క యుద్దేశ్యములను బట్టియు, అది మానవకోటికి మొత్తముమీద కలుగజేయు ఫలితములను బట్టియు నిర్ధారణ చేయబడుచుండును. సత్యము, అహింస, అస్తేయము, మొదలగునవి, ప్రతిజాతిలోను సామాన్యధర్మములుగ నుండుటకు యిదియే కారణము. మన పూర్వులలో కొందరు మహర్షులకు వీనిని భగవంతు డొకప్పుడు బోధించి యుండె ననుట వెర్రిమాట. పూర్వులలో కొందరు యిట్టివి ఉపదేశించినారు గనుక, అవి మనకు విధ్యుక్తధర్మములని యెంచతగదు. వీనిలో కూడ స్థూలసూక్ష్మములు ఆయా కాలపరిస్థితులను బట్టి యుండవలసి వచ్చును. ఈ ధర్మములు నిత్యములని చెప్పుటకు, కొన్ని సమయములందు మనము సందేహించవలసి వచ్చును.

VII. జీవితముయొక్క పరమావధులు రెండు వేరు మార్గములు పట్టుచున్నవి. (1) దేవునికొరకు మనము జీవించుట, (2) మన సోదరమానవులకొరకు జీవించుట. దేవునికొరకు జీవించదలచిన జాతులనేకములు నశించినవి. వారి నాగరికత భగ్నమైనది. ఈ ప్రపంచముకొరకే జీవించుచున్నామని యనుకొన్నవారు, తమ బుద్ధిని, హృదయమును వికసింపజేసికొనుచున్నారు. దారిద్ర్యము, దౌర్జన్యము, అజ్ఞానము మొదలగునవి ప్రపంచములో నుండి తొలగించుటకును, ప్రకృతి రహస్యములను కనుగొని వానిని మానవసౌఖ్యమున కుపయోగించుటకును, అనేక ప్రయత్నములు చేయుచున్నారు. దేవతలను, వారి కార్యములను వారు చూచుకొమ్మని చెప్పి, మానవసేవకే తాము జీవించుచున్నామని నిశ్చయించుకొన్నారు. ఎవరికర్మ వారిదనియు, యెవరి మోక్షము వారు చూచుకొనుటయే యుత్తమమనియు, యీ రెండవమార్గము నవలంబించువారు యెంతమాత్రము అంగీకరించరు.

VIII. సందు. రాజబాట యనునవి రెండుమార్గములున్నవి. మొదటిదానిలో, ఒక్కొక్కమనిషియే, తన క్షేమమును, చూచుకొనుచు నడచుటకు మాత్రము జాగా యున్నది. ఈ సన్నసందులో తాను, తన భార్యా, పిల్లలు, కలసి నడచుటకు తగినంత వెడల్పుగల స్థలము లేదు. ఈమార్గము, మూఢవిశ్వాసమనే, యెడారిగుండా పోవుచుండును. అక్కడక్కడ, ఒక బాటసారి కనుపడుచుండును. త్రోవలో యే

దైన ఒక పుష్పము కనుపడినను, దానిని పుణికి ఆఘ్రాణించ కూడదు. అది నిన్ను మోసపుచ్చును. దానిక్రింద ఒక విష సర్ప ముండవచ్చును. నీవు, నీ దృష్టిని యిటూ అటూ త్రిప్పకుండ, పైకి స్వర్గమునకేసి నిగుడించుము. నీస్నేహితుడు, భార్యా, పిల్లలకొరకు, వెనుకకు చూడకుము. నీయాత్మను నీవు సంరక్షించుకొనుచుండవలెను గాని, వారు నీవెంట రారని తెలిసికొనుము. వారందరు నరకమునకు పోయినను, నీవు మాత్రము స్వర్గములో సుఖ మనుభవించుచుందువు. రెండవమార్గము విశాలమైన మార్గము. దానివెంట మన కుటుంబము, మన స్నేహితు లందరు కలసిపోవచ్చును. పక్షుల కిలకిలారావములు, సూర్యకిరణప్రసారము, నీడలు, నదీప్రవాహ ములు, అనేక ప్రకృతి విచిత్రములు యీ త్రోవలో కనుపడు చుండును. నడువలేని దుర్బలులకు మన మందరము కలసి సహాయముచేసి మనవెంట తీసికొని పోవచ్చును. కళలు, శాస్త్రములు, సంగీతము, నాటకములు మొదలగు నాహ్లాద కరములగువానిని అనుభవించవచ్చును. కాబట్టి మన మానవ సోదరుల సౌఖ్యముకొరకే మనము జీవింతము.

---

# 3 వ అ ధ్యా య ము

## మ త ప రి ణా మ ము

ప్రపంచములోని మతములన్నియు, మానవ కల్పితములై క్రమ క్రమముగా పరిణామమును పొంది, మొదట సరళముగను, అనలంకృతముగ నుండి, పిదప డాంబికముల తోను, ఆడంబరములతోను, హేతుపూర్వకము గాని సిద్ధాంతములతోను, అవిశ్వాసపరులయందసహనముతోను, నరక బాధలు మొదలగు బెదరింపులతోను నిండిపోయినవి. కాబట్టి యీ మతముల పరిణామము జనసామాన్యమునకు సర్వదా బోధచేయుచున్నగాని, యీ మతములలోని మూఢ విశ్వాసములు మనలను వదలవు.

మనుష్యుడు, ప్రపంచ పరిణామావస్థలో జన్మించి, అనేక లక్షల సంవత్సరములైనది. మత గ్రంథములలో మొదటిది ఋగ్వేదమనియు యిది పుట్టి ముప్పదివేల సంవత్సరములు కానచ్చుననియు, ప్రకృతి శాస్త్ర పరిశోధకులు వ్రాయుచున్నారు. స్వభావ సిద్ధముగ మానవుడు దైవభక్తితో పుట్టినాడని మత స్థాపకులు మత గురువులు నమ్మెదరు, కాని, ఆధునిక శాస్త్రజ్ఞులు, యీ యూహ సరికాదనియు మానవుడు ఓరాం గొట్టాంగు, చింపాంజి, గోరిల్లా జాతిలో

చేరిన తోకలేని కోతులనుండి జన్మించి, మెదడు క్రమముగా వృద్ధిమైనదనియు, యీ భగవద్భక్తి మన చిన్నతనములోని అభ్యాస ఫలితమనియు వాదించెదరు. అనేక అడవిజాతులలో నేటికిని మతమును గురించి గాని, దేవుని గురించిగాని, చచ్చినవాడు తిరిగి పుట్టుటను గురించి గాని బొత్తిగా తల పెట్టక పోవుటయే యీ రెండవ వాదనకు గొప్ప నిదర్శన మని, స్పెన్సరు మొదలగు గొప్ప భౌతిక శాస్త్రజ్ఞులు పెక్కు లుదాహరణములను పేర్కొనిరి.

మొట్టమొదట, పిశాచముల యనుగ్రహము సంపాదించుటకు, వానిని ప్రార్థించుటతో మతము మొదలు పెట్టినది. చనిపోయిన మనషి దయ్యమో, భూతమో యగునని, అతని యాగ్రహమును తప్పించుకొనుటకును, అనుగ్రహము సంపాదించుకొనుటకును, ప్రార్థనలు చేయుచు, వారికి భోజన పదార్థముల నిచ్చు నలవాటు అడవి జాతులకే గాక, జపానీయులు, చీనావారు, మస్లిములు, హిందువులు, క్రిస్టియనులు, బౌద్ధులు మొదలగు మతములవా రందరికిని, నేటివరకు మామూలైపోయినది. ఈ చనిపోయిన వారిలో ప్రసిద్ధులకు యెక్కువ గౌరవము లిచ్చి, వారిని దేవతలుగ పూజించుచు, గుళ్ళు గోపురములు కట్టించ మొదలిడిరి. ఇదియే విగ్రహారాధనకు పునాది.

అడవి జాతులలో యిట్టి నమ్మకములకు ఆదిమ కారణములు వారి స్వప్నములు-ఆత్మ, శరీరమునుండి బయ

టకుపోయి, అనేక విధములగు అనుభవములను పొంది తిరిగి తన శరీరములోనికి వచ్చునని వారి నమ్మకము. బ్రతికియుండగానే, ప్రతి దినము నిద్రలో యిట్టి యనుభవములు ప్రతివానికి సంభవించునపుడు, చనిపోయిన తరువాత శరీరములు ఖనన దహనములైనంత మాత్రమున యిట్టి యాత్మ యేల నిలువదని వారి తలంపు. సాధారణముగా చనిపోయిన కళేబరము నొద్ద అన్నము వస్త్రము మొదలగునవి నైవేద్యము జరుగుచుండెను. ఇట్టి నైవేద్యము, నేటికిని నియమిత కాలములో జరుగుచునే యున్నది. ఇట్టి నమ్మకములను బట్టియే మనవారి పితరుల తిథి ప్రయోజనములను జరిగించుచున్నారు. వారు మన మిచ్చు మెతుకు గింజలు నీళ్ళు అనుభవించుచు తృప్తులై అనేక సంవత్సరములకు కూడా వీనికి కనిపెట్టుకొని యుందురట! ఇట్టి పిచ్చి భ్రాంతి, మన విద్యాధికులకు కూడ నేటికిని వదల లేదు.

మృతినొందినవారు తమ జీవిత కాలములో మంచి పనులు చేసిన యెడల పితృలోకములో సుఖముల ననుభవించుచుందు రనియు అమృతము పానము చేయుచు సంగీతము పాడుకొనుచు రంభా సంభోగము చేయుచు, యీ ప్రపంచములోకంటె అనేక రెట్లు స్వర్గ సుఖముల ననుభవించుచుందు రనియు, హిందు ముస్లిము మొదలగు మతముల వారి తలంపు. మృత కళేబరమును దహనము చేసిన చోటను, పాతివేసిన చోటను, గుళ్లు గోపురములు, మసీ

దులు, బౌద్ధారామములు, పిరమిడ్డులు మొదలగునవి వెలసి
నవి. మొదట అక్కడ నుంచుచుండిన అన్న పానీయ
నైవేద్యములే పిమ్మట గొప్ప యజ్ఞముల క్రింద మారినవి.
చనిపోయిన వారికి చేయు ప్రార్థనలు, కోర్కెలే మిగుల
శ్రమపడి చేసిన అనేక క్లిష్టకర్మ కలాపములుగను మంత్రతంత్ర
ములుగను విస్తరించినవి. వారు జీవించి యున్నపుడు మనకు
వారియందు గల గౌరవమే వారిని అవతారములుగ చేసి
మిక్కిలి చిక్కైన సేవలుగను పూజా విధానములుగను
మారి, తుదకు మత గురువులు, పురోహితులు, ఋత్విక్కులు,
అర్చకులు మొదలగు వారు బయలుదేరిరి.

మానవుడు, క్రింది జంతువులనుండి మొదట యుద్భవిం
చినపుడు దేవుడనిగాని, దయ్యమని గాని అతని మనస్సున
కేమియు తట్టి యుండదు. అతని మెదడు వృద్ధిపొంది విచార
ణశక్తి అంకురించినపుడు, ప్రకృతిని వీక్షించి దానిమీద తన
కెట్టి యధికారమును లేదని తెలిసికొనగానే, భయమనునది
జనించి కదలెడు ప్రతివస్తువునందును తనకు కానరాని యే
దేవతయో యొకటియుండి దానిని కదలించుచున్నదని వెరగు
పడి చూచుచుండును. తన బంధువులు, స్నేహితులు మృతి
నొందగనే వారు దయ్యములై, తమకు హానియో, మంచియో
చేయుచు యీ ప్రపంచమునే కనిపెట్టుకొని యుందురని ఒక
నమ్మకముదయించును. తమచుట్టు ప్రకృతిలో అనుదినము
సంభవించు, ఆశ్చర్యకరములగు విషయములను చూచి, యే

దియో వర్ణించనలవిగానిది, కానబడనిది, ఒక భయంకరమైన వస్తువు ఒకటి యున్నట్లు భావించును. అది యిట్టిదని మాత్ర ము నిర్ణయించజాలడు. తనకంటె బలవంతులైన తనమానవ సోదరుల యెడల తానెట్లు నడచుకొనునో, అట్లు యీ భయం కరవస్తువు నెడల నడుచుకొనుచుండును. వారి దయను తానెట్లు సంపాదించుకొనుటకు ప్రయత్నించునో, దాని దయనుకూడ, అట్లు సంపాదించుకొన దలచును. తన విషయమై తనకే తెలియనపుడు, యిట్లు తలచుటలో నాశ్చర్యమేమి? తాను కేకలు వేసినపుడు ప్రతిధ్వని కలుగగానే యెవరో మరియొకరు, సమీపములోనున్న కొండల నుండియు, అడవుల నుండియు తన్ను వెక్కిరించుచున్నారని యనుకొనును. నీళ్లు త్రాగుటకు ఒక తటాకములో తలవంచగానే, మరి యొకరు ఆ నీటిలో తనవలెనే కనబడును. తనతో కూడనున్న తన స్నేహితుల మోములుకూడ కనుపడును. తా నెక్కడికి వెళ్ళినను, తన నీడ తనతో వెంబడించు చుండును. తాను నిద్రించి యుండ గానే తా నెక్కడికో పోయి యేమేమియో చర్యలు జరిగించి నట్లు స్వప్నములు కలిగి తనకు మెలకువ రాగానే, పూర్వపు స్థలములో యథాప్రకారము పడుకొన్నట్లే కనుపడును. మరి కొన్ని సమయములలో గాఢనిద్రలో నడచి యే వస్తువో తనకు తగిలి మేలుకొనును. ఈ యనుభవము లన్నియు నిజ ముగా జరిగినవే గనుక, యేకకాలమందే నిద్రయు మాటయు, నడకయు, యెట్లు సంభవించినవని వితర్కించుకొని, తనకు

రెండు శరీరము లున్నవని నిశ్చయించును. తన రెండవశరీర మును తన యాత్మలేక పిశాచము లేక యిష్టదేవతగా భావించును. అది తనతో కూడ యెల్లప్పుడు నుండునని నమ్మును. తాను నిదురించునపుడు, అది యెక్కడికో పోయి, అనేక కార్యములు చేసికొని వచ్చుచుండును. తా నెంత ప్రయత్నించినను ఆ రెండవ శరీరము కనుపడదు. అయినను యిట్టి భూతములే, ప్రకృతిలో ప్రతివస్తువునందును ఉండి తీరునని యూహించును. తనకు వలెనే వారికికూడ వివిధచిత్తవృత్తు లున్నవని నమ్మును. వానికికూడా కోపము, దయ, ఆకలి, దప్పి మొదలగు లక్షణములన్నియు నున్నవిగనుక, వానిని భక్తి శ్రద్ధలతో తన వశము చేసికొనుటకు ప్రయత్నించు చుండును. ఇక మృత్యుదేవత తన చుట్టూ యెల్లప్పుడు కనుపడుచున్నపుడు అతని భయమునకు మేరయే లేదు. అందులో ముఖ్యముగా మరి యొకరి చేత బలాత్కారముగ చంపబడకుండ స్వాభావసిద్ధముగ ప్రాణములు క్రమక్రమముగా పోవుట చూచినపుడు దానికి కారణములు మిక్కిలి గూఢమైనవిగా కనుపించి, దయ్యములు దేవతలు తప్పక కలరని నమ్మును. అనాగరిక దశలో ముసలివాడు కాకుండగనే క్రూర జంతువుల వలనను, విరోధుల వలనను, అకస్మాత్తుగను, బలాత్కారమరణము సంభవించు చుండుటచే మృత్యు భయమెల్లప్పుడు అతనిని ఆవరించియే యుండును. ఒకానొకప్పుడు యుద్ధములో దెబ్బ తగిలి స్మృహా తప్పి పడిపోయి చాలాసేపటికి తిరిగి లేచుటయు

మూర్ఛరోగము, అతిభక్తి పారవశ్యము మొదలగు కారణ ములచేత స్మృతి లేక తరువాత మేలుకొనుటయు, చూచి ఆశ్చర్యమానసుడై ఒకమనిషి చచ్చిపోయినను అతని రెండవ శరీరము యిక్కడ అతని సమీపముననే నిలచియే యున్నదని నమ్ముచుండును.

ప్రకృతిలో తనకే విధమైన కారణములు కనుపించకనే గొప్ప మార్పులు కలిగినపుడు, చనిపోయిన వారికెవరికో కోపము వచ్చినదని యూహించి, వాని కోపము చల్లార్చు టకు వానికి వివిధోపచారములు చేయుచుండును. ఆ చనిపో యినవాడు, తాను బ్రతికియుండగా జనుల వలన యపకారము పొందుటచేతనే, యిట్లు పగ సాధించుకొను చున్నాడని నమ్మును. ఆ చనిపోయినవాడు తన పూర్వీకులలో గాని, తన సంఘ నాయకులలో గాని ఒకడై యుండవచ్చునని తల చును. పితృపూజకు యిట్టి యూహలే, పునాది. పసిబాలుని ఆలోచనలవలెనే, పూర్వకాలపు వారివి కూడ నిర్దిష్టములు కాకుండ అస్పష్టముగానే యుండును. తాము తమ మనో వీధులలో సృష్టించుకొన్న దేవతలు, తమవలెనే యుందు రనియు, కాని యెక్కువ బలశాలులుగను, యెక్కువ జ్ఞాను లుగను నుందురనియు వీరి యభిప్రాయము.

కొంత కాలమునకు ప్రతి సంఘములో వ్యాపించిన ఆచారములు, సాంప్రదాయములు, అయిహిక సంబంధములైన యూహలు, పూజలు, కర్మకాండలు మొదలగు వానిని

తరచిచూచి, సంఘము కొన్ని కట్టుబాట్లతో నీతి మార్గము తప్పకుండ చేయవలెనని అప్పుడప్పుడు సంఘములోనవర్తించు పెద్దలు గ్రంథములను వ్రాసి మతకర్త లనిపించుకొనిరి. మన ఆర్యమతము అనేకమంది ఋషులచేతను, హిబ్రూమతము ఆమాస్, హోసియా, ఇసాయా, జరీమియా, మొదలగు ప్రవక్తల చేతను, క్రైస్తవ మతము, క్రీస్తు, పాల్, సెంటు ఆగస్టైన్, సిప్రియన్, వెస్లిలూథరు, న్యూమన్, మొదలగు వారి చేతను, మహమ్మదీయమతము మహమ్మదు, కాలిపుల చేతను, బౌద్ధమతము గౌతమ బుద్ధదేవుని చేతను, యిట్లే పార్సీ, చైనా మతములు జోరోష్టరు, కన్ఫూషియస్, మొదలగు వారిచేతను, వివిధమతములు స్థాపించబడి వృద్ధి చేయబడినవి. వారు మతగ్రంథములను వ్రాసి గొప్ప మతాచార్యులుగా నేటికిని యెంచబడుచున్నారు.

పైన వ్రాసిన ప్రకారము మతముయొక్క పుట్టుకను తెలిసికొంటిమి గనుక వాని పరిణామమును గురించి కూడ కొంత ఆలోచింతము. ఈ విశ్వములోనుండు వస్తువుల యొక్కయు మనుష్యులయొక్కయు రహస్యములను తెలిసికొనుటకు మానవుడు ప్రయత్నించ మొదలిడెను. ప్రకృతి రహస్యములను తెలిసికొనుటకు అనేక విధములైన పురాణ గాథలు బయలుదేరినవి. వానిని స్వాధీనములోనికి తెచ్చుకొనుటకు అనేక మంత్ర శాస్త్రములు బయలుదేరినవి. రెండవ దానిలోనుండి వేదాంతశాస్త్రము, మొదటిదానిలోనుండి

భౌతిక మానసిక శాస్త్రములు క్రమ వికాసము నొందినవి. పూర్వుల మతములలో నాలుగు లక్షణములు ముఖ్యముగా కనుపడును. (1) ప్రతి జీవములోను ఆత్మ యున్నదను నమ్మకము. ప్రకృతిలోని ప్రతి పదార్థములోను ఒక దేవత యుండితీరును. లేనిచో వానిలో మార్పు లేల కలుగవలెను? ఈ దేవతలు తమ చనిపోయిన పూర్వులైనను కావచ్చును, లేక, యితర దేవతలైనను కావచ్చును. (2) మంత్రముల యందు నమ్మకము. మానవుల భయములు, కోరికల ననుసరించి తమ కొరకు ప్రకృతిలోని పదార్థములను, తమ స్వాధీనములోనికి తెచ్చుకొనుటకు, వారు ప్రయత్నింతురు. వేటలో, అపజయము, రోగములు, యుద్ధములు, అతివృష్టి అనావృష్టులు, యీతి బాధలు మొదలగునవి, మన దురదృష్టముచేత కలిగినపుడు, అతి నమ్మకముతో కొన్ని మంత్రముల నుచ్చరించుచు కొన్ని కర్మలను చేయుచు, వానిని తప్పించుకొనుటకు ప్రయత్నించెదరు. ప్రకృతిని కొంతవరకైనను స్వాధీనము చేసికొనుటకు భౌతిక శాస్త్రజ్ఞానము లేకపోవుటచే, నీ విధానము నవలంబింతురు. (3) మన యందరిపైనను, యేదియో యొక అమానుషశక్తి యున్నదని నమ్మకము. (4) మతావేశము. భయము కోరికలే దీనికి ముఖ్యకారణములు. దైవభక్తి యందు మనస్సు లగ్నమై ఒడలు మరపించి, మనస్సు మన చేత అనేక పిచ్చి చేష్టలు చేయించును. శరీర సంరక్షణ కూడ అలక్ష్యముచేసి, ఆహారము దప్పిక లేకుండ, రణరంగ

మందుఱుకుటయు, ధైర్యముతో ప్రాణములను పోగొట్టు కొనుటయు సంభవించుచుండును. ప్రకృతిలో నెన్నడును సంభవించని ఆశ్చర్యకరమైన విషయములను ప్రుక్కటి పురాణములగుండ మతాచార్యులు వెల్లడించుచుందురు.

ఇట్టి మతములు, అనేక విధములుగ నానా దేశములలో వృద్ధియై జ్ఞానకాండ కర్మకాండలను మిళితముచేసి ఊహాప్రపంచముమీద నాధారపడి మత గ్రంథములును, వానిని విప్పి బోధించుటకు మతాచార్యులును వెలసిరి. కొన్ని మతములలో దేవుడు, జోక్యము కలుగజేసికొని సర్వము తానే చేయుచున్నాడనియు, కొన్ని మతములలో తన భక్తులయొక్క బుద్ధిని బట్టియే సమస్త వ్యాపారములు జరుగుచుండుననియు మరికొన్ని మతములలో, అప్పుడప్పుడు మాత్రము తాను అవతరించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయుచుండుననియు బోధింపబడుచుండును. కొంత కాలముక్రిందట ఒక్కొక్క జాతికి వేరువేరు దేవుళ్ళుండిరని యభిప్రాయపడుచుండిరి. (Henotheism) ఇప్పుడు కొన్ని మతములలో దేవుడు ఒక్కడేననియు, ఆయన ఒక్క తావులోనే యుండక సర్వాంతర్యామిగా నున్నాడనియు చెప్పబడినది(Pantheism) స్వర్గనరకములు వేరే యొకచోట నున్నవనియు, అక్కడకు మన యాత్మలు పోయి శిక్షయు సుఖమును అనుభవించి తిరిగి ప్రపంచములోనికి తన శరీరములో ప్రవేశించుననియు కొన్ని మతములు చాటును. ( Theism with its personal

anthropomorphic God) మరికొన్ని మతములలో మన యాత్మలు ప్రళయకాలపర్యంతము అన్నియు ఒక ప్రపంచములో (Purgatory) వేచియుండి తరువాత, వాని పూర్వకర్మలనుబట్టి స్వర్గ నరకములలో శాశ్వతముగా నుండునని వ్రాయబడినది. మరియొక మతములో ఆత్మ తన కర్మచేత అనేక జన్మ పరంపరలు కలిగి వాని ఫలములను అనుభవించిన తరువాత, దేవునిలో నైక్య మగుటయో, ఆయన సమీప మందుండుటయో శాశ్వతముగా సంభవించునని చెప్పబడినది. కొన్ని మతములలో దేవుడనే వాడు ఒకడు వేరే లేనే లేడని వ్రాయబడినది.

దేవతలు ప్రతి గొప్ప వస్తువునందును ఉందురను నమ్మకముచేతనే, పెద్ద కొండలమీదను, గుహలలోను, గొప్ప వృక్షములు అడవులున్నచోట్లను, గొప్ప జీవనదుల ఒడ్డులను, గుళ్ళు గోపురములు కట్టుదురు. ఆ నదీ స్నానముల కును, ఆ దేవుళ్ళను సేవించుటకును, యాత్రాపరులు వేల కొలది పోవుచుందురు. అట్టిచోట్లను, మతాచార్యులనేకులు మతములను స్థాపించి వారి వారి మత సూత్రములను బోధ చేయుచు, యాత్రికులవద్ద ధనమును స్వీకరించి జీవింతురు.

మతము వలన పూర్వకాలములో సంఘములకు మేలే చేకూరుచుండెను. సంఘము ఛిన్నము కాకుండ, దాని వ్యక్తులలో అయికమత్యము కలుగజేసి దానిని నిలబెట్టిన సంస్థలలో మతము ప్రధానము. మనకు కంటికి గోచరము

కాని విషయములను యెట్లయినను తెలిసికొనుటకు ప్రియ త్నించుట మానవుని ముఖ్య లక్షణము. భౌతిక శాస్త్ర జ్ఞానము బొత్తిగా లేసపుడు, యీ ప్రకృతిలో జరుగు విచిత్ర ములను చూచి, ముగ్ధుడు కాక యుండునా ? మెఱుపులు, ఉఱుములు, తుపానులు, భూకంపములు, సెలయేళ్లు ఋతు వులు, చంద్ర సూర్య నక్షత్రాదుల గతులు, గ్రహణములు, అగ్నిపర్వతములు, చిన్న విత్తనములనుండి పెద్ద వృక్షములు పెరుగుట మానవుని పుట్టుక, పంచ భూతములు, మొదలగు వానికి యిప్పటివలె సమీపకారణములైనను కనుగొనలేక కేవ లము శిశువువలె నేదియో పెనుభూతమో దేవతయో వీనిని కలిగించుచున్నదని తలచును. తనకు కావలసిన పదా ర్థములకు దానినే ప్రార్థించును. అప్పటి నీతి నియమములకు కూడ మత విశ్వాసము ఒక ముఖ్య పునాది. మరికొన్ని వేల శతాబ్దములకు గాని తానెట్టి యైహిక ఫలములను కోరక అధ్యాత్మిక విషయములయందాలోచనలు చేయుట యెరుగడు. రాజకీయ సాంఘిక శిక్షలకంటె మత శిక్షయే మానవులను ఆనాటి కాలమందు నీతి మార్గమున ప్రవర్తింప చేసినది. మత గురువులు రాజులు ఒండొరులకుతోడై రాజ కీయ శిక్షలు మత శిక్షలును బలపడినవి. మతమునుబట్టియే స్వజాతీయాభిమానము జనులకు న్యాయవిధియందు గౌరవ మేర్పడినది.

మతము వలన కొన్ని నష్టములు కూడ కలుగక

పోలేదు. అది సంఘ సంస్కరణ కర్తలకు యెల్లప్పుడు అడ్డుతగులు
చునే యుండెను. మన స్వాతంత్ర్యమును అరికట్టి దాని విమ
ర్శకులను భౌతిక శాస్త్రజ్ఞులను పరిశోధకులను సంశయాత్మ
లను అనేక బాధలకులోను గావించెను. రాజకీయ స్వాతంత్ర్య
ములకు కూడ మతము విరోధిగానే యుండెను. ప్రకృతిలో
నూతన సత్యములను గ్రహించి ప్రచారము చేయనీయలేదు.
ఇది యంతయు పూర్వ మత సాంప్రదాయములు, మూఢా
చారములునిలబెట్టుకొనుటకే. రాజులు, ప్రజలు, చాలా కాలము
మతగురువుల చేతులలో కీలు బొమ్మలై, బానిసలై యుండ
వలసి వచ్చెను. ప్రపంచములో జరిగిన అనేక యుద్ధములు,
మతాహంకారావేశముల వలననే జరిగినవి. మతము మానవ
కోటిలో వివిధజాతులకు వైషమ్యములు పుట్టించెను. అసహ
నము దురభిమానము పెంపొందించెను. ప్రజాస్వామిక ప్రభు
త్వమునకు యీ మతములే అనేకాటంకములు కలిగించెను.
రాజులను విష్ణు సంభూతులుగ నొనర్చెను. సత్యాన్వేషణులను
అగ్ని దేవునికిని, మారణ యంత్రములకును ఆహుతి చేసెను.
భూగోళశాస్త్రము నంతయు తారుమారుచేసి యీ మానవుని
కొరకే, యీ ప్రకృతి యంతయు సృజించబడి యీ భూమి
చుట్టూ సూర్యుడు నక్షత్రములు తిరుగుచున్నట్లు ప్రతిపా
దించి, వీరి వాదనను ఖండించు శాస్త్రజ్ఞులను అగ్నిహోత్రు
నికి ఆహుతులనుగ జేసెను. స్త్రీల స్వాతంత్ర్యములను అడగ
ద్రొక్కెను. అస్పృశ్యులనువారిని సృజించెను. మనుష్యులను

భానిసలుగ చేసెను. బ్రాహ్మణ మతము, వివిధవర్ణము
నేర్పరచి వానిని శిలారూపము దాల్చినట్లుచేసి, వారి
వేరువిధములైన శిక్షలను పక్షపాతబుద్ధితో నేర్పరచెను
క్రైస్తవమతమునకు పునాదియైన బైబిలును గురించి వేరు
వ్రాయనక్కర లేదు. అట్లు విమర్శించదలచుట చచ్చి
పామును చావ గొట్టుట వంటిది. అనేకవందలమంది పాశ్చా
త్యశాస్త్రజ్ఞులే దానిని స్తనశల్యపరీక్ష చేసి సంపూర్ణముగ
ఖండించిరి.

లోకములో అన్ని మతములకు ఒకటే పునాది—ప్ర
కృతి బాహ్యమైన అమానుషమైన ఒక వస్తువునందు నమ్మ
కము. దీనిని మనప్రార్థనలవలనను, యజ్ఞములు బలుల వల
నను వశపఱచుకొనగల మని నమ్మకము. ఈమతముల
వేరును, మొదలును ఒకటేకాని, వానిశాఖలు, రెమ్మలు వేఱు
వేఱుగా నుండును. ఒకదానిని ఆరాధించు అడవిమనుష్యునితో
పాటు, శాలువలు కప్పుకొను మతాచార్యులు కూడ యీ
సృష్టియొక్క ఆద్యంతమును గురించియు, చావు బ్రతుకులను
గురించియు, జీవుల భవిష్యద్గతిని గురించియు చీకటిలోనే
యున్నారని మనము తెలిసికొనవలెను. వీరిద్దరిలో నా కెట్టి
భేదము కనుపించదు. ప్రకృతి రహస్యజ్ఞానమును గురించి వీరు
భయులు తులతూగుచునే యున్నారు. ఇద్దరును ఒకే తప్పును
ఒకే మూఢ విశ్వాసమునుకలిగి, తెలియని వస్తువునకు మోక
రించి కన్ను మూసికొనుచున్నారు. ఉభయులు అమానవ

మైన ఒకవస్తువు సహాయమును వేడుచున్నారు. వీనిలో నెవ
రికిని ప్రకృతియొక్క యేకరీతిని గురించి ఆలోచనయే లేదు.

---

## 4 వ అధ్యాయము.

## మ త వి శ్వా స ము లు.

ఏ విషయము నైనను నమ్ముటకు సహేతువుల మీాద
నాధారపడు విచారణ శక్తి కావలయును గాని మూఢవిశ్వా
సములు కూడదు. ప్రపంచములోని మతములన్నియు అనేక
మూఢ విశ్వాసముల నందలము లెక్కించి, విచారణశక్తి నడు
గంట జేయుచున్నవి. ఎంత ఉత్కృష్ట భావనతో మనము
నమ్మకములు కలుగచేసికొన ప్రయత్నించినను, ఊహాప్రపంచ
ములో, ప్రాయశః జరుగవచ్చునన దగిన స్థితికి రాగలుగుదు
మేమోగాని, యిదమిత్థమని వక్కాణించుటకు వలను పడదు
గదా! తుదకుయిట్టి విషయములు, కేవలము అనుభవైకవేద్య
ములేయని మన వేదాంతులు చెప్పుచుండిరి. అయినను ప్రాయశః
జరుగవచ్చుననదగిన యూహలుకూడ యిదివరకు జరిగిన దాని
మీాద నాధారపడవలెనుగాని, యెన్నడుజరుగని దానిమీాద
నాధారపడకూడదు గదా! మన మెరుగని దానిమీాద

కాకుండ యెరిగిన దాని స్వభావము మీదనే మనము నిలువ వలయును. హేతువాదమును తృణీకరించువాడు తన మాన వత్వమునే పోగొట్టుకొనును. అట్లగుచో, యీ పిచ్చి నమ్మక ములను పుట్టించినవా రెవరు? మన మతకర్తలే. మొదట, అనాగరికులగు అడవిమనుష్యులను, నీతిపథము త్రొక్కుట కును, మనోవాక్కాయశుద్ధులలవడ జేసికొనుటకును, పుక్కిటి గాథలతోను, దైవ ప్రార్థనలతోను, పూజాడంబరములతోను, అనేక కర్మవిధానములతోను మతములనువానిని పెంచుచుం డిరి. తమరు చెప్పినవానికి సహేతువులున్నను సరే, లేకున్నను సరే, వాని యందు నమ్మకముంచి తీరవలెననియు, లేనియెడల రౌరవాది నరకమున పడుదురనియు, వీనికి సహేతువులు కల్పించుకొనుమనియు, వాదించెదరు. ఇట్టి విధానము మన లను బానిసలుగా చేసి వైచు చున్నది.

ఇటీవల ప్రపంచమంతటను గాలి తిరిగినది. ధైర్య ముతో బుద్ధి కుశలత నుపయోగించుచున్నాము. గ్రహణ శక్తి అధికమైనది. మనోబానిసత్వము పటాపంచలమగుచున్నది. నైతిక జీవనమునకు మతము పునాదిగా యెంచబడుటలేదు. మనస్స్వాతంత్ర్యము మీదనే, ప్రపంచములోని మేధావంతు లందరు జ్ఞాన విజ్ఞానములను పెంపొందించుచున్నారు. సత్య మును కనుగొనుటకు వివేచన శక్తినే యాధారపరచుకొను చున్నారు. ఇదియే మన భౌతిక జీవనమును సౌఖ్యప్రదము చేయుటకు సర్వదా ప్రయత్నించు చున్నది. మనోబానిస

తృప్తికంటె మనస్స్వాతంత్ర్యమే యెక్కుడు సుఖము నిచ్చును. మతము లన్నియు, యీ బానిసత్వమునే వృద్ధిపరచినవి. ఇవి మనలను కొన్ని విషయములను విధిగా నమ్మవలసినదనియు ఆచరించవలెననియు ఆజ్ఞాపించు చున్నవి.

మనుష్యుడు, యెక్కడనో ఒక స్వర్గమందున్నాడని చెప్పు ఒక నిరంకుశ ప్రభువునకు దాసుడుగా నున్నంతవరకు, తానుకూడ ఒక నిరంకుశ ప్రభువుగానే వర్తించును గనుకనే, తామేర్పరచుకొన్న దేవునితో పాటు తాముకూడ నడువ వలెనని సామాన్యప్రజలు ప్రయత్నించెదరు. ప్రతి మతమందును, మతకర్తలు నాలుగు విషయములను ప్రతిపాదించెదరు. (1) దేవుడను వాడొకడున్నాడు. (2) అతను తన యభిప్రాయములను, ఆజ్ఞలను, మన మతగురువులకు స్పష్టముగా తెలియచేసెను. వారు వానిని గ్రంథస్థము చేసిరి. (3) వారికి ఆయన స్వయముగా వచ్చి చెప్పినాడు. (4) వానిని నమ్మని వారు నరకకూపమున బడిపోవుదురు. మనము ముందుగా ఈ అబద్ధపు నమ్మకములను పుక్కిటి కథలను తరిమివేయ వలెను. మనకు మోక్షము ఈ పిచ్చి నమ్మకముల వలన రానేరదు. హేతు వాదములనుబట్టి మన తెలివితేటలవలన యెల్లపుడు నిజము తెలిసికొనలేకపోవచ్చును. మన నిశ్చితాభిప్రాయములలో భేదాభిప్రాయములకు తావుండవచ్చును. ఇవి యెంత అసంపూర్ణములైనను, కార్యాకార్యములను నిర్ణయించుటకు మనకు గల ఈ విచారణశక్తినే వదులుకొని, ఒకరు

చెప్పిన మాటలనే నమ్ముచూ వానినే యాధారము చేసికొని మానవులు వర్తించినయెడల నేలవిడచి సాముచేసిన వారమగుచున్నాము. మన అసంపూర్ణ మేధాశక్తిని కూడ విడనాడినచో, వెలుతురేమియు లేని చీకటికూపమున మనము పడిపోవలసి వచ్చును. తన పిల్లవాని గొంతుక కోసి కాళికకు బలి యిచ్చిన తల్లికి స్వర్గము తప్పక చేకూరునని ఒకమత గ్రంథ మంగీకరించుచో దాని యందు నమ్మకముంచిన వారు యెట్లు దానిని పోగొట్టుకొన గలరు? దానిలోనున్న మూఢాచారములకును, విశ్వాసములకును, నీతి విషయములకును భేదములెట్లు కల్పించుకొని వేరుపరతురు? తన పిల్లనుచంపుతల్లి తన మతగ్రంథమునందున్న నమ్మకముతోనే, త్రికరణశుద్ధిగనే ఆ పని చేయుచున్నపుడు, ఆమెను గర్హించనేల?

ఏ మత గ్రంథముమీద గాని నమ్మకము లేనంతమాత్రమున మనకు పాపము కలుగనేరదు. అపనమ్మకములో నీతి గాని, అవినీతిగాని లేనేలేవు. నమ్మనివారు నశింతురను వాక్యము వెర్రిమాట. వృథాప్రలాపము. అసత్యము. సంశయాత్మా వినశ్యతి యను లోకోక్తికి భయపడకుడు. మనలను రక్షించునట్టియు, శిక్షించునట్టియు దేవుడే ఒకడున్న యెడలను, ఆతను న్యాయస్థుడును, పరమదయాళుడును కూడనై యున్నయెడలను, మనకు కానబడని ఆయనను పూజించలేదనియు, ప్రార్థించలేదనియు, ఆయన భక్తులమని చెప్పుకొను వారి మాటలను విశ్వసించలేదనియు మత గ్రంథములలోని

విషయములను, పిడి వాదనలను కర్మకాండయు త్యజించితి మనియు, మనలను శిక్షించదు. అహింసా సత్యముల నాధారముగ చేసికొని నీతిపరునిగా వర్తించుచున్నానా లేదా, నేను త్రికరణశుద్ధిగ నా శక్తికొలది నా సోదరులకు సహాయము చేసితినా, లేదా యను విషయముల నాలోచించును గాని, ప్రపంచములోని పరస్పర విరోధములతో కూడుకొన్న యే వెర్రి మతమునో నమ్మలేదని గాని, దానిలో చెప్పిన పిచ్చి కర్మకాండల నాచరించలేదని గాని, నన్నెన్నడు ఆయన శిక్షించడు. ఏని యన్నిటి యందును నమ్మకము పోయినంత మాత్రము చేత, నా యాత్మోపలబ్ధికి భంగమెన్నటికి రాదని నా నిశ్చితాభిప్రాయము. మన మనోబానిసత్వమును వీడి, పాఠశాలలలో, పసిబాలురకు కూడ నీతికి మతసాంప్రదాయములు గాక వేరు పునాదులున్నవని మనము సదా బోధచేయవలయును.

భౌతికశాస్త్రము లన్నియు, మూఢ మతనమ్మకములకు విరోధములు. అవిప్రతివిషయమును సవిమర్శచేయుచుండును. బైబిల్ మొదలగు మత గ్రంథములలో వ్రాసిన సృష్ట్యోత్పత్తిక్రమములను అసత్యములని రుజువు చేయును. మానవ కళ్యాణమునకు, విశాలదృష్టితో నైతిక విధానముల నన్వేషించు చుండును. కాలక్రమమున యెట్టి పరిణామములు యివి పొందుచుండెనో తెలియచేయును.

ఈ కాలములో, మనవారు గొప్పవారి పేర శిలావిగ్ర

హములు స్థాపించునట్లుగానే, మనపూర్వులుగూడ చనిపోయి వారి విగ్రహములను పెట్టుకొని పూజించెడువారు. అదిగా మానవులకు భయోత్పాతమగుపక్షులు, జంతువులు, పాము మొదలగు వానిని వాని యనుగ్రహము బడయుటకు వా నారాధన చేయుచుండిరి. అట్టి భావములే, చెట్లు చేమల నక్షత్రములు, చంద్రులు మొదలగు వానిని పూజించుట ప్రోద్బలము నొసంగినవి. పెద్ద దేవతలు, చిన్న దేవతలు, నక్ష త్రములు మొదలగు వానికి, ఘనుల యాత్మల చేతనత్వారోపణమును, మానవ గుణారోపణమును చేయుచు ప్రార్థనలు, శాంతులు, ఉపాసనలు కో పోపశమనముల మొదలు పెట్టిరి.

ప్రపంచములోని మతముల నన్నిటిని పోల్చి చూచి యెడల వీనిలోని ప్రతిదాని యుత్పత్తియు, ప్రకృతి సిద్ధమై లేక పాంచభౌతికమైన కారణములను బట్టియే కాని, అమాన షమైన లేక ప్రకృతికి బాహ్యమైన కారణములను బట్టికా దృష్టాంతములు :—

(1) బైబిలులో వ్రాసిన జలప్రళయకథ, హైంద పురాణములలోను, అకేడియా, అస్సీరియా, బాబిలోనియా దేశస్థుల పురాణములలోను కనుపడుచున్నది. (2) బైబిలులో మోసెస్ పట్టుకకథ, అస్సీరియావారి కథవలెనే యున్నది (3) అస్సీరియావారిది, మనకువలెనే, చాంద్రమానమేగా వారికి, సప్తమి, షష్ఠి, చతుర్దశి దినములు ఉపవాసవ్రతములు

(4) హిబ్రూ, ఈజిప్టు జాతులలో దేవుడనగా బలశాలియనియే అర్థము. మొదట, వారికట్టి దేవుళ్లుబహుమందియుండితరువాత కొంతకాలమునకు ఒక దేవదేవు డున్నాడను భావము కలిగినది. (5) ఈ దేవతల తెలివితేటలు, నీతినియమములు, భిన్న భిన్న విధములుగ ప్రతిమత గ్రంథములోను వర్ణింపబడినవి. వీరికి దయ, కోపము, అహంకారము, వంచన, అబద్ధము మొదలగు సుగుణదుర్గుణములు, అనేక విధములుగ వర్ణింపబడినవి (6) పూజావిధానములో రొట్టె, మాంసము, అన్నము, ద్రాక్షరసము, సోమరసము, నెయ్యి, సాంబ్రాణి, దీపములు, మెడ తెగని అఖండము, అగ్నిహోత్రములు మొదలగునవి అన్ని మతములకును సామాన్యము లైనవే. ఈజిప్టువారు, గ్రీకులు, హిబ్రూలు, దున్నపోతులను, యెద్దులను, గొర్రెలను వారి దేవుళ్లకు బలియిచ్చుచుండిరి. హిందువులు, నరమేధము, అశ్వమేధము, గోమేధము, మొదలైనవి చేయుచుండెడివారు. బీదలు కోడిపెట్టలు, గొర్రెలు మొదలగు క్షుద్రజంతువులను యిప్పటికిని బలియిచ్చుచున్నారు. (7) గ్రీకుల దేవుడు ఒలింపస్ పర్వతముమీదను, హిబ్రూల దేవుడు సినేపర్వతముమీదను, హిందువుల దేవుళ్లు కైలాస మేరు పర్వతములమీదను, ఈ విధముగా దేవుళ్లను పర్వతముల మీద నెక్కించి దేవాలయములను పర్వతములమీద నే కట్టుచుండిరి. (8) ఉపవాసములు, ప్రాయశ్చిత్తములు, భవిష్యద్విషయములను తెలుపుట, అమానుషక్రియలు, హిందువులు, క్రైస్తవులు, మస్లిములు, హిబ్రూలు,

గ్రీకులు మొదలగు వారిమతములలో చేరియున్నవి. (9) దేవుని లోనుండి యుద్భవించిన కథల కంతమేలేదు. క్రైస్తుయినుక్కలేపియస్, నిబుకడ్నజార్, బ్రహ్మ, కుమారస్వామి మొదలగువారి కథలు దీనికిదృష్టాంతములు. దేవుళ్ల చెవులు, కన్నులు, తలలు, కమండలములు, నాభి, కాళ్లు, వెన్నెముకలు, బాహువులు, ఊరువులు, కడుపు, పాదములు, యివియనియననేల, సర్వాంగముల నుండియు ఘనులుపుట్టినట్లు మనపురాణములలో వ్రాయబడి యున్నది. ఇక, దర్భ, కుంభ, నిప్పు, సూర్యుడు, చంద్రుడు, మేక, నలుగుపిండి, గాలి, పర్వతము, రాయి, భూమి ఈ మొదలగు సమస్తచరాచరముల నుండియు, దేవతలు, రాజులు, యోగులు, ఘనులు పుట్టినట్లు నమ్మించు పుక్కిటి పురాణములను వ్రాసి, వానిని వేదవాక్యములుగ భావించి, వానిని సత్యములైనవే యని నమ్మించు హిందువులు పఠించుచున్నారు, (10) అన్ని మతములలోను జ్ఞానస్నానము, మంత్రోపదేశము, పాపములనొప్పుకొని ప్రాయశ్చిత్తముచేయించుకొనుట, సన్యాసము, నైష్ఠికబ్రహ్మచర్యము భోజనాత్పూర్వమునను పరమునను మంత్రోచ్చరణము, పార్థనము, సామాన్యముగా నున్న విషయములే.

పైన వ్రాసిన విషయములను బట్టి మన కంటికి కనుపడని యొకవ్యక్తి ఆకాశమునకు పైనుండి ఆయామానవ సంఘములకు కొన్ని కొన్ని మతములను, ఆధ్యాత్మిక విషయములను, ప్యాకెట్టులుగ కట్టి క్రింద పడవేయుచున్నాడనిగాని

కొందరి చెవులలో వానిని ఊదెనని గాని యెంచక ప్రపంచములోని ఆ యా దేశములలో ప్రజల భావములు, దేశకాల పరిస్థితులను బట్టి కలిగిన స్వభావజన్యమైన సాంఘిక పరిణామావస్థ లని యేమాత్రము యింగిత జ్ఞానము గలవానికైనను గోచరించక మానదు. ఇట్లు వ్రాయుట వలన, నైతికమార్గమునకు మతము బొత్తిగా ఉపయోగపడలేదని నేను నిరసించుటలేదు. ఈ మతము లన్నియు పౌరుషేయములే యనియు, యివి యెట్లు పుట్టినవో యెట్లు పరిణామమును పొందినవో తెలుపుటయే నా యుద్దేశము. వేదములు, ఖురాను, బైబిల్, జెండు అవస్థా, మొదలగు మత గ్రంథములు, అనేక విషయములలో భిన్న రూపములు దాల్చిన వగుటచేత, పరమకళ్యాణుడగు సృష్టికర్త, వీనిని సృజించి, జాతులలో ఒండొరుల మీద అసహనమును కల్పించి, యెవరికి వారే తమదే సత్యమని నమ్మునట్లు చేయడని నా తలంపు.

పూర్వకాలములో మనుష్యు డనాగరిక స్థితిలోనుండి, బుద్ధి విరివిగా వికసించనపుడు వైద్యుడే మత గురువు, మాంత్రికుడు న్యాయాధికారి, జ్యోతిష్కుడు, సోదెచెప్పువాడునై యుండెను. ఈ యుద్యోగము లన్నియు ఒకని యందే నిలుపుటకు ముఖ్యకారణము వారి దేవతలయందు యీ శక్తుల నన్నిటిని ఆరోపించుకొని, వారి కోప ప్రసాదములకు వేచియుండుటకు అలవాటు పడుటయే. నేపాళదేశపు రాజొకడు తన చక్కని భార్యకు స్ఫోటకము తెప్పించి, ఆమె

నందవికారము చేసినవని తాముపూజించిన విగ్రహములమీఁ
కోపగించి, దేవాలయము లన్నింటిని ఫిరంగులతో పడగొ
ట్టించి, దేవుళ్ళవిగ్రహములను, ముక్కలు ముక్కలుగచేసెను

పిశాచములే తమ విపత్తుల కన్నిటికిని కారణములని
పూర్వు లందరు నమ్మచుండిరి. వీనిలో కొన్ని శత్రువుల
కొన్ని మిత్రములు. అకస్మాత్తుగా సంభవించు ఆపదలన్ని
కిని యీ దయ్యములే మూలకారణములని వారు నమ్మ
చుండిరి. వైద్యుడే వీనిని వంచుటకును, మంత్రములతో వీని
వెళలగొట్టుటకును, ఉపకరించుచుండెడివాడు. క్రమే
దేవుని స్వభావమును గురించి, మానవుల తలంపులు వికా
మును పొందినకొలది, మతస్థాపనలు, నిబంధనలు, మ
గురువుల ధర్మములు, కర్మలు మొదలగునవి రాజొచ్చినకొ
పూర్వము యింటిపెద్ద, రాజు యీ మత కర్మలను కూడ
చేయించు అధికారము కలవారై యుండి, తమ యిత
రాచకార్యములతో తీరికలేక వీనిని ప్రత్యేకముగ ను
గురువులనువారికి వదలివేయ జొచ్చిరి. ఈ మతాచార్యుల
తమ స్వలాభము కొరకు యీ కర్మ కలాపములను, అ
క్లిష్టముగజేసి, అనేక నూతన నిబంధనలను తమకిష్టమ
వచ్చినట్లు పెంచి, మత గ్రంథములను వ్రాసి వానిని దై
దత్తములని చాట మొదలిడిరి.

మొదట మృతులైనవారిని దేవతలుగాన
దయ్యములు గాను పూజించుచు ప్రజలు తమలో తగవు

పెట్టుకొని వారివారి దేవతలే యెక్కువ ఘనులని వాదించ జొచ్చిరి. నేటికిని, యిల్లే మత కలహములు జరుగుచునే యున్నవి. మన హిందువులలో ఒక శాఖయగు బ్రాహ్మణులలోనే ఒకప్పుడు అగ్ని, ఒకప్పుడు యింద్రుడు మరియొకప్పుడు వరుణుడు ప్రధాన దేవతలుగ భావింపబడి, తుదకు వీరందరికంటెను గొప్పవాడగు ఒక ఆదిదేవు డున్నాడని నమ్ముటకు ప్రారంభించిరి. ఆయనే మనకును దేవతలకును తండ్రి యను భావము బయలుదేరినది. ఆయనమధ్యను మన మధ్యను ఒక మధ్యవర్తిని కొన్ని మతములలో యేర్పరుచుకొనిరి. క్రైస్తు, మహమ్మదు, అటువంటివారే. కాని మనము పూర్వ సాంప్రదాయములను విడువక, అనేక విధములైన యిష్ట దేవతలను పూజించుటయే గాక, కందపిలకలను, రావిచెట్లను, పాములను, జంతువులను, పక్షులను, రాళ్ళు రప్పలను, పూజించుట నేటికిని వదలలేదు. దేవుడు సర్వవ్యాపి గనుక అన్నిటిలో నిండియుండుటచే, వీని పూజలను సమర్ధించుటకు మన విద్యాధికులు కూడ సిద్ధపడుచున్నారు.

రాజకీయ విషయములతోబాటు మత విషయములు కూడ ప్రపంచములో సరిసమాన నిరంకుశత్వముతో కొద్ది కాలము క్రిందవరకు సాగినవి. ఈ రెంటిమీదను తిరుగబడుటకు ప్రజలు మొదలుపెట్టి జయమును పొందుచున్నారు. మొదటి దానిని ఛేదించిన కొలది రెండవదికూడ పడిపోవుట నిశ్చయము. మొదటి దానిని రెండవది ఆశ్రయించు

కొని దానికి సహాయము చేయుచుండుట బట్టియే ప్రజాస్వామిక పరిపాలనము ప్రపంచములో నలు మూలల వ్యాపించిన కొలది యీ మత దాస్యము కూడ తొలగి మనస్స్వాతంత్ర్యము వృద్ధి కాక తప్పదు. ఈ రెండును ఒండొంటికి మొదటినుండియు సహాయ భూతములై మానవ సాంఘిక మనస్స్వాతంత్ర్యములకు భంగము కలిగించి యిప్పుడు రెండును కూలిపోవుచున్నందుకు మన మెంత మాత్రము దుఃఖించ నవసరము లేదు. వీనిలో ఒకటి కూలగానే, రెండవది కూడ కూలి తీరును.

పూర్వకాలమందు బలశాలియైన ఒక నిరంకుశ ప్రభువు, సంఘమును కట్టుదిట్టములలో నెట్లు యుంచ వలసి యుండునో, ఒక మత గురువుకూడ ఆతనికి బాసటయై నిలచి, అతడు విష్ణు సంభూతుడని బోధచేసి సంఘమును తగిన నైతిక కట్టుబాట్లలో నుంచుటకు మత ప్రచారమును కొనసాగించవలసి యుండెను. అప్పటి మానవ సంఘములలోని పశు గుణములు, అహంకారము, దౌర్జన్యము, పగసాధించుట, అనృతము, అవినీతి, మొదలగునవి పోగొట్టుటకే మతము ముఖ్యసాధనమైన దని మనమందరము ఒప్పుకొనవలసిన విషయము మే. ఇది తమ, ఐకమత్యము, నైతిక ప్రవర్తన వృద్ధి చేసినదికాని, అనేక కీడులకు కూడ కారణమైనది. మార్పులకు ఒప్పుకొనకుండుట దీని స్వభావము. పట్టుదలలకును, పిడివాదములకును ఆకరము. ప్రపంచములో జరిగిన అనేక

యుద్ధములకు రక్తపాతములకు ఇది ముఖ్య హేతువు. మనుష్యులలో తగవులను వృద్ధి చేసినది. యుద్ధములను పురిగొల్పుటలో యీమతగురువులు ప్రధానులు. కాబట్టి మన నైతికాభివృద్ధికిని, యిట్టి మతములకును సంబంధము విడగొట్టబడుచున్నది. నిజముగా మన నాగరికులకంటె అడవిజాతులలోనే సత్యము, విశ్వాసము, నిరాడంబరము, హెచ్చుగానున్నవని భౌతిక శాస్త్రజ్ఞులు తేల్చిరి. వారిలో దేవుడు, ఆత్మ, స్వర్గ నరకములను పదములే లేవు. మనలో రాజ్యతంత్రజ్ఞులు యుక్తిశాలురు, యెట్లు ఒండొరులను వంచించుకొనుచున్నారో మన మనుదినము జూచుచునే యున్నాము. మతము పేరట నరబలులు, బందిపోటులు, యుద్ధములు, అవినీతికరములగు శక్తి పూజలు, ఆచారములు, అసహనము, మొండివాదనలు, ప్రజల నజ్ఞానదశలో నుంచుట, పిచ్చినమ్మకములు, బెదిరింపులు, బాధలు మొదలగునవి బయలుదేరినవి. కాని, యీ మతము లన్నియు, యిప్పుడు ప్రజలలో మనస్స్వాతంత్ర్యము ప్రబలి, భగ్నము లగుచున్నవి. ఇంతవరకు విద్యాధికులుకూడ, యీ మత గురువులకును మత గ్రంథములకును దాసులై, నిరర్థకములైన కర్మకాండలలో మునిగి తేలుచు ధైర్యసాహసములు లేక, పిరికి పందలై గ్రుడ్డెద్దు చేన బడ్డట్లు తాముచ్చరించు మంత్రములకు అర్థమును కూడ గ్రహించక పురోహితులు చెప్పినట్లు తమకు నమ్మకము లేకపోయినను యేకర్మము-లో చేయుచు,

స్వవంచకులు పరవంచకులు నగుచున్నారు. ఎవరు తమ తెలివితేటల నుపయోగించి ఆధునిక శాస్త్రములతో వానికి పెడర్థములనుచేసి వానిని సమర్థింప జూచుచున్నారు. ఇక్కెంత కాలము వీరు ప్రజలను మోసగించెదరు? మానవ జాతు లన్నియు కలసి, లోక కళ్యాణమునకు ఐకమత్యముతో పాటుపడు కాలము సమీపించుచున్నది. మనోదాస్య శృంఖలములు పడిపోవుచున్నవి. జ్ఞానభానుడు మింటికి వచ్చి యున్నాడు. మూఢాచారములు మూఢమత సాంప్రదాయ ములు గాలికెగుర గొట్టబడు కాలము వచ్చినది. మంచువలె నవి కరగిపోక తప్పదు.

---

## 5 వ అధ్యాయము.

## దేవుళ్లు, దెయ్యములు.

ప్రపంచములో నున్న ప్రతి మతమును, ఒక్క దేవుని నైనను సృజించుకొనును. ఆ దేవుని పోలిక, సృజించుకొన్న వారి వలెనే యుండి, వానికి కొన్ని చిన్నెలు, వన్నెలు పెట్ట బడుచుండును. సృజించుకొన్నవారి యిష్టా యిష్టములే, ఆ దేవునికి కూడ నారోపించుచుండురు. ఈదేవుడు బలవంతుల

పక్షముననే యుండును. ఈయన మిక్కిలి స్వదేశాభిమానము కలవాడు. తన్ను సృజించిన జాతినితప్ప, అన్యజాతులను అసహ్యించుకొనును. ఈ దేవుళ్లందరు పొగడ్తలు, యిచ్ఛకములు పూజలు కోరుచుండురు. వీరిలో బహుమందికి బలులు కావలసి యుండును. నిరపరాధులగు జీవరాసుల రక్తము, వీరికి దివ్యమైన పరిమళము. వీరిలో భోజనప్రియులు, అలంకారప్రియులు, భోగపరాయణులు, భార్యలు కలవారు అనేకమంది యున్నారు. ఈ దేవుళ్ళకు కొందరు మతాచార్యులుండవలెను. ఈ మతాచార్యులను ప్రజలు పోషించవలెను. వీరు తమ దేవతలే గొప్పవారనియు, యితరజాతుల క్షుద్ర దేవతలను జయించగల రనియు వీరు సదా చాటుచు, నమ్మని వారు రౌరవాది నరకములకు పోదురంటారు.

ఈ దేవతలను, అనేక మాదిర్లుగ జనులు సృజించు కొందురు. కొందరికి వేయి చేతులు నూరు తలలు కల్పించుదురు. పాములు, మనుష్యుల పుర్రెలు కంఠహారములుగ కొందరికిని, మరి కొందరకు రెక్కలను, చేతులలో కొందరికి శూలములు, గండ్రగొడ్డళ్లు, చక్రములు, వజ్రాయుధములు, మొదలగు వానిని, ధరింపజేయుదురు. ఈదేవతలలో కొందరు కోపిష్టులు, కొందరు తెలివితక్కువవారు, కొందరుమనుష్యజన్మమెత్తి చావు పుట్టుకలు కలవారు. కొందరు హంస, వృషభము, శానుబంధు, మన్నపోతు, సింహము, గుఱ్ఱము, మేఘము, యెలుక, నెమలి మొదలగు వాహనములమీద నెక్కెదరు.

వీరు మర్త్యస్త్రీలను వివాహము చేసికొని బిడ్డలను కనుటయు కలదు. వీరి పిల్లలు కూడ పిల్ల దేవుళ్లగుచున్నారు. ఈ దేవుళ్ళలో గొందరికి భూమి గుండ్రముగా నున్నదని తెలియక, దానిని చాపచుట్టినట్లు చుట్టబోవుదురు. వీరు సూర్య చంద్ర గతుల నాపివేయ గలుగుదురు. వీరు శంఖము పూరించగానే కోటగోడలు బ్రద్దలగును. నగరములను త్రివ్వి నదులలో ముంచగలరు. తమ్మును జనులు ప్రేమించ వలయునని ఆజ్ఞల నొసగెదరు. మనుష్యులు కోరినదంతయు తామీయగలమని వీరికి ఒక పిచ్చిభ్రమ. వీరి పుట్టుకలను, వీరు జరిగించిన అమానుష చర్యలను గురించి, యేమాత్రము అపనమ్మకము కనుపరచినను, అది నరక హేతువని యెంచెదరు. ఈ దేవతలలో యెవరును సృష్టి క్రమము నెరుగరు. భూగర్భ శాస్త్రము, ఖగోళశాస్త్రము మొదలగు భౌతిక శాస్త్రములు గాని, రాజధర్మములలో, కార్య నిర్వాహక శాసనాధికారవిషయములు గాని యెంతమాత్రము తెలియక యేవియో కొన్ని పిచ్చి ధర్మముల నుపదేశించుచు, చిన్న చిన్న దేవతల పరివారముతో స్వర్గములో కొలువు సాగించు చుందురు. ఈ దేవత లందరు ఎక్కడో ఆకాశములో నున్నను, మనుష్యుల వ్యవహారములలో సదా జోక్యము కలుగ జేసికొనుచుందురు. మనకు బోధ చేయుటకు భూమిమీదకు దిగివచ్చు చుందురు. గ్రహసంచారము మొదలగు పెద్ద విషయములను, ఆకులు మొదలగునవి క్రిందరాలుట వంటి చిన్నవిషయములను, వీరు

కనిపెట్టుచునే యుందురు. వీనిలో కొందరు ఆకాశమునుండి ఉరుములు, మెఱపులతో వచ్చి తల్లిపాలు కుడుచుచున్న మేకపిల్లను చంప కూడదనియు, స్త్రీలకు పిల్లలను పుట్టించవద్దనియు లేక పుట్టించుమనియు, మతాచార్యులు యెట్టి దుస్తులు వేసికొన వలసినదియు చెప్పుటకు కూడా వచ్చుచుందురు. తమ్ము నమ్మిన వారికి స్వప్న ఫలముల నిచ్చెదరు. నమ్మని వారికి, నరకప్రాప్తి తప్పదు. మన పూర్వులు, దేవతలను, రాక్షసులను పుట్టించుటకు వేరు వేరు కర్మాగారముల నేర్ప రచిరి. ఈ రాక్షసులు కూడా ఒకానొకప్పుడు చెడు కర్మలు చేసి క్రిందపడిన దేవతలే.

ఇది యంతయు మానవ స్వభావము వలననే కల్పితమైనది. మనుష్యుడే యీ దేవతల నందరిని సృజించెను. తనకు వలెనే వారిని చేతులు, కాళ్ళు, తల, ముక్కు, కళ్లు, కలవారుగ చేసెను. ప్రతిజాతియు తన భాషనే వారికి నేర్పెను. తాను ఖగోళము, చరిత్ర, భూగోళశాస్త్రము మొదలగు వానిలో యెంత నేర్చుకొనెనో, వారికిని అంతే నేర్పెను. కొదువదంతయు పాలు, నేయి, పెరుగు, కల్లు, పానకము, మొదలగు సముద్రములను ఆతల కుతల మహాతలము మొదలగు ప్రపంచములను—యీ విధము లైనవి అనేకము తన యూహలమీద నిలపెను. ఏదేశములో నున్న పశుపక్ష్యాదులను ఆదేశపు దేవుళ్లకు వాహనములుగ చేసెను. ఆ దేశపు దుస్తులనే వారికి కట్ట బెట్టిరి. వీరిని ప్రతీకములుగ చేసికొని

పూజించు కొన దొడగిరి. తాము వినినది, చూచినది, ఊహించినది మాత్రమే అనేక మార్పులతో చిత్రించుకొనిరి. మనుష్యుడు తన యజ్ఞానముచేత బాహ్య ప్రపంచమంతయు తనకొఱకే, తనకంటె యెక్కువ జ్ఞానముగల పురుషుని వలన ఉదయించెనని నమ్మెను. అట్టివానితో స్నేహము చేయుటకే యీ మతములేర్పడినవి. భయముచేత యీ దేవుళ్లకు మోకరించి ప్రార్థించును. వారి సహాయము వేడును. తనకు చేకూరినది ఆయనే యిచ్చినాడని వందనము లర్పించును. తనకు కష్టము వచ్చినపుడు దానిని తప్పించుటకు ఆయనను బ్రతిమాలును. ఆకాశమందున్న ఉరుములకు మెఱుపులకు భయపడును. తన కన్నులకు కానరాని దేవతలు, దయ్యములే, క్రూరమృగములను, విషసర్పములను, తోకచుక్కలను, గ్రహణములను, నక్షత్రములను, సృజించిన వారని గట్టిగ నమ్మెను. లోకములో చావు బ్రతుకులను చూచి వారి కోపము నుపశమింప జేసి, వారి దయను సంపాదించుటకు, పొగడుట, ప్రార్థించుట, పూజించుట, బలులను వేయుట, యీ మొదలగు వానిని చేయుచుండును. మన కిట్లు భయమును కలుగ చేసి, వీని నన్నిటిని, పుక్కిటి పురాణముల గుండా నమ్మించి, బ్రతికే వారే మన మతగురువులు. దీనివలననే వారు జీవించెదరు. వీరే దేవతలకును, మనకును, మధ్యవర్తులు, సంధి చేయువారు. స్వర్గములో న్యాయాధికారి పీఠము యెదుట క్రైస్తు, మహమ్మదు మొదలగువారే మనకు ప్లీడర్లు. ఈ

మతాచార్యులే మన మనవులను, దేవునికి తెలియ చేయు దురు. అక్కడనుంచి దేవుని యాజ్ఞలను ప్రపంచములోనికి తెచ్చుచుందురు. ఈ మతాచార్యుల కాళ్లమీదబడి, మనము వారికి దాసులము కావలెను.

అడవిమనిషి మొదట రాళ్లను, రప్పలను, చెట్లు, పుట్ట లను, పూజించును. తరువాత వాని యధిష్ఠాన దేవతలను, అటు తరువాత ఒక్క దేవుని మాత్రము పూజించును. తుదకు, యీాయన పూజకూడ తనకు లాభించనపుడు, యోచనకు ప్రారంభించును. తత్వ విచారణచేయ మొదలిడును. ఇదియే వేదాంత విషయము. ఇది యూహా ప్రపంచముమీాద నిలవవలసి వచ్చును. మనుష్యుడు తన మీాదనే యాధారపడి, తన పూర్వకర్మ తన సుఖదుఃఖములకు కారణమని యెంచును. దేవతలను దయ్యములను త్యజించి, పురుషప్రయత్నము మీాదనే సామాన్యముగ ఆధారపడుచు, స్వతంత్రముగ పని చేయుచు, ఆ పని సానుకూలము కానపుడు, తన పూర్వ కర్మను, అదృష్టమును దూరుచుండును. తుదకు దైవమను నొక దాని మీాద భారమువేసి తృప్తినొందును.

పూర్వుల మూఢవిశ్వాసములు, ఆధునిక భౌతికశాస్త్ర ముల వలన పటాపంచలై పోవుచున్నవి. స్టీమర్లు రైల్వేలు వచ్చి పూర్వపు కాటకములను, దేశమంతయు సర్వత్ర వ్యా పించి, లక్షలకొలది మనుష్యులు చావకుండ పోగొట్టినవి. విషూచి, మశూచి, జ్వరము మొదలగు రోగములు, దేవతల

ప్రమేయము లేకుండ నానా దేశములనుండియు పారదోల బడుచున్నవి. పూర్వమున్నంత పని, యీ కాలములో దేవత లకు లేదు. వారికి పెన్షను లిచ్చి కూర్చోబెట్టితిమి. దైవము మీద భక్తికలవారందరు, లోకములో జరుగు ప్రతి విష యము, యేదియో నొక యుద్దేశముతో దైవమే జరుపు చున్నాడని భావించెదరు. దానిని ప్రకృతికి వదలరు. చెట్లు, పువ్వులు, కాయలు, పర్వతములు, నదులు, యెండ వాన మొదలగు వానిని కనుపరచి, దేవుని మహిమను కొనియాడు దురు. శరీరముమీద రణము వేసి, యది రమ్యముగా పెరుగు చున్నపుడు దానిని చూచి వీరేల యుప్పొంగరు? అది యెంత అందముగా గుండ్రముగా బయలుదేరును! క్రమ క్రమముగా యెంత సొంకముగా వ్యాపించును! దానిరంగు యెట్లు మారు చుండును! రక్త మెట్లు అపరిశుద్ధ మగుచుండును! అదియెట్లు మనుష్యుని శరీరమును, అన్నహితవు తప్పించి, బలహీనముగ చేయును! భూతద్దమును పెట్టి దానిని పరిశోధించిన యెడల జీవ జంతువులు, నానారకములైనవి యెంత అందముగా ప్రాకుచు మనకు చూపట్టును! ఇది యంతయు భగవన్ని ర్మాణము కాదా! కాబట్టి దీనిని సృజించిన వాడు యెంత మంచివాడు! యెంత గొప్పవాడు! యెంత సర్వశక్తికలవాడు!

ఆద్యంతములులేని ప్రకృతి, ఆద్యంతములు లేని భగ వంతుని వలననే పుట్టిన యెడల యిక భగవంతుడనువాడు ప్రత్యేకముగ, వేరె యెక్కడ, మిగులును? పదార్థము,

శక్తియు మాత్రమే బాహ్య ప్రపంచమునకును, మన మనో భావములకును ఆధారములని యెంచినయెడల భగవంతుడను వాడు, మాటి మాటికి మన వ్యవహారములలో జోక్యము కలిగించు కొనుచుండు నని చెప్పుకొనుట వెర్రిమాట. మతమను పిచ్చి సంస్థాపన లుండనే యుండవు. కేవలము బైబిల్, ఖురాన్, మన సమస్త పుక్కిట పురాణములు మొదలగు నవి యన్నియు జారిపో వలసినదే. అప్పుడు భగవంతుడను వాని దయ సంపాదించుటకు మానవుడు పూజాపునస్కారము లను పరిగణించడు. ఐహిక విషయములలో నీతినియమము లను గురించియు విశ్వమానవకోటి కళ్యాణమును గురించియు మార్గముల నరయుచుండును గాని, అధ్యాత్మిక విషయములు మోక్షమార్గములు వేరే యున్నవని తలచడు. వానికొరకు తలపట్లు పట్టుకొనడు. వేదాధ్యయనము వలన మన చలి పోవునా? బట్టలు ధరించుటవలనను, నిప్పు సెగ వలనను పోవును. కాటకములు పోగొట్టుటకు ఒక నాగలి పనికివచ్చు నంతగా, లక్షల మంత్రములు, ప్రార్థనలు, ఉపన్యాసములు ఉపయోగించునా! ప్రపంచము పుట్టినప్పటినుండి యీ రోజు వరకు మానవకోటి దైవమునకు చేసిన ప్రార్థన లన్నియు, కలిపినను అమృతాంజనము వలె మన తలనొప్పిని తగ్గించ గలవా? గాంధిమహాత్ముడును, ఆంగ్లేయ మతాచార్యులును చేయు ప్రార్థనలను విని భగవంతుడు దిగివచ్చి యింగ్లాండు ప్రజల హృదయములను కరగించ గలడా? ప్రకృతికి దయ

దాక్షిణ్యములు లేవు. ప్రార్థనలవలన అది మీకు లోబడదు. మీ కోప పరితాపములకది లక్ష్యపెట్టదు. మీ యేడుపులకది జాలి నొందదు. అది యెల్లపుడు తటస్థముగానే యుండి తన పని తాను చేసికొను చుండును. న్యాయ మెప్పుడు జయ మొందలేదనియు, దేవతలు నిరపరాధుల పక్షమున నెల్లప్పుడు నుండ లేదనియు, మతములకును, న్యాయమునకును మిక్కిలి దూరమున్నదనియు మతముల మూలముననే ప్రపంచ మంతయు ద్వేషముల తోడను, మనోభానిసత్వము తోడను, నిండినదనియు, మనుష్యుడు గ్రహించు చున్నాడు. మానవ సంఘాభి వృద్ధికి, అపనమ్మకమే ముఖ్యకారణము. ఈ అప నమ్మకమే మూఢవిశ్వాసముల ననేకములు యిదివరకు తొల గించెను. ప్రకృతి పరిశోధనలే, సృష్టికర్తయను వానిని, లోక వ్యవహారముల నుండి దూర దూరముగ తరిమి వేయుచున్నవి.

---

## 6 వ అధ్యాయము

## దైవ ప్రార్థనము.

దేవు డొక డున్నాడని యెంచినను ఆయనను ప్రార్థిం చుట వలన మనకు లాభము కలదా యను విషయమును గురించి మహాత్మా గాంధిగారు తమ యభిప్రాయములను

వెల్లడించిరి. తమ స్వానుభవము వలన దైవ ప్రార్థనచేతనే తన ప్రాణములు నిలచినవనియు, లేని యెడల తాను కష్ట పరంపరల వలన పిచ్చివాడనై యుండుననియు, తాను నిస్పృహుడు కాకుండ యీ ప్రార్థనయే తన్ను కాపాడుచున్న దనియు తన చిత్తశుద్ధికిని, మనశ్శాంతికిని యిదియే కారణ మనియు వ్రాసియున్నారు. కాబట్టి దీనికి నమ్మకమే తప్ప మరియొక సహేతువును కనపరుచుటకు ప్రయత్నించుట వెర్రి తన మని కూడ యీయన సెలవిచ్చిరి. కేవలము నమ్మ కముమీదనే యాధారపడువారందరు, యిట్టి భక్తిమార్గము నవలంబించి మనశ్శాంతి పొందుచుందురుగాని, సంశయాస్ప దులకు యీ హేతువులు రుచించవు.

మన ఆర్యసాంప్రదాయములను బట్టి భక్తిమార్గము మోక్షసాధనములలో ఒక సోపానము మాత్రమే యని స్పష్టపడుచున్నది. మన వేదాంతము జన్మపరంపరల నంగీక రించుటచే, పూర్వజన్మ కర్మ ఫలములను మన మనుభవించ వలసి యుండగా భగవత్ప్రార్థనల వలన మన కర్మ ఫలము లను తప్పించుటకు భగవంతు డెట్లు పూనుకొనగలడు? ఏల పూనుకొనవలెను? కర్మకూడ అనాది యని మన వేదాంతము నమ్మినపుడు, భగవంతుడు మాత్ర మెక్కడనుండి వచ్చెను? అతనేల కర్మబద్ధుడు కాడు? ఋగ్వేదములోని నాసదీయ సూక్తములో చెప్పినట్లు హిరణ్యగర్భుడనెడు వాడు మొదట ఒకడుండినను యీ సృష్ట్యారంభము ఆయనకును తెలుసునో

లేదో యెవరు చెప్పగలరు? ఒకవేళ ఆయన స్వాయంభువు కావచ్చునని మన మంగీకరించినను యీ పంచభూతములు, వాని పరిణామమును ఆయనయే యేర్పరచినట్లు మనము నమ్మినను, యీ సృష్టి నంతయు గడియారము తిరుగునట్లు ఒక్కసారే నడపుటకు మొదలు పెట్టినపుడు ఆయన మధ్య మధ్య యడ్డుపడుచు మన ప్రార్థనలను విని యీ సృష్టిలోని సకల చరాచర వ్యవహారములలో తాను జోక్యము కలుగ జేసికొని సృష్టిక్రమ వికాసమున కడ్డుతగిలి తన వ్రేలు పెట్టు చుండునా? లేక కాల చక్రము దాని యంతటది తిరుగుచు మన కర్మానుభవము ననుసరించి నిర్దయాత్మకముగ తన దారిని తాను పోవుచుండునా?

సంచిత కర్మలలో నెన్ని యీ జన్మమందు ప్రథమములో ప్రారబ్ధమైనవో వానినే ప్రారబ్ధము లనియు (అనగా ఆరంభములైన సంచితములు) ప్రారబ్ధము కానివి అనారబ్ధము లనియు మన వేదాంతము బోధించుచున్నది. ప్రారబ్ధము ననుభవించక తప్పదు. కాని మన జ్ఞానముచే అనారబ్ధమును యీ జన్మలోనే నశింపజేసికొని ముక్తి బడయ వచ్చును. జన్మ రాహిత్యమును మనము చేసికొనవచ్చును. సంచిత కర్మ భోగము ఒక జన్మమునందే సాధారణముగా సమాప్తి కానేరదు. ఈ సంచిత కర్మలలో అనారబ్ధ కార్యములు కొన్ని తప్పక మిగులుచునే యుండును. వీనిని భోగించుటకు మరల జన్మ మెత్తక తప్పదు. ఇదియే మన వేదాంతసారము.

కర్మ అనాది యగుటచే దాని యఖండవ్యాపారము నందు పరమేశ్వరుడు సైతము స్వతంత్రించి అడ్డుపడజాలడు. బ్రహ్మాత్మైక్య జ్ఞానముచే, బుద్ధిని శుద్ధపరచుకొని పరమేశ్వరుని వలెనే, కర్మల నాచరించుచు, మోక్ష మార్గము నరయ వలెను గాని, ముక్కు మూసికొని ఆయనను ప్రార్థించుచు కూర్చుండుట వలన యెట్టి లాభము చేకూరగలదు? కర్మ ఫలత్యాగమార్గమునకు భక్తిమార్గము, కూడ కొంత సహాయము చేయువచ్చునేమో గాని యీ రెండవ దానికి స్వశక్తి యున్నదని భావించుటెట్లు? ఇహలోకమందు మన కష్టములు, దీనివలన తొలగునని తలచుట వట్టి భ్రాంతి యని నా తలంపు. ఇంద్రియ నిగ్రహముచే, బుద్ధిని స్థిరముగను శుద్ధముగను చేసికొని సృష్టి క్రమానుసారముగ ప్రాప్తములగు కర్మలు కర్తవ్యములని యనాసక్తబుద్ధితోడను, శాంతము తోడను, చేయుచుండు వారే సత్యమగు విరక్తు లనియు, బ్రహ్మపదము ప్రాపించు పురుషులనియు భగవద్గీత చెప్పు చున్నది. (గీ అ 3 శ్లో 7; అ 4 శ్లో 21; అ 5 శ్లో 79; అ 18 శ్లో 11.)

మనుజునియొక్క యే కర్మ మైనను శుభమని కాని, యశుభమని కాని మనము చెప్పుచుందుము. కాని యిట్టి శుభాశుభములు కర్మయందులేవు. అవి కర్మ నొనరించు పురుషుని బుద్ధి నవలంబించి యున్నవని లెస్సగ గమనించవలెను. కర్మలయందు చెరువును తీసివైచుట యనగా,

తన బుద్ధిని శుద్ధముగ నుంచుటయే యని గీతయందు సిద్ధాంతీకరింపబడినది. ( గీ అ 2 శ్లో 49-51 )

సామాన్య జనులకు భక్తిమార్గము చిత్తశుద్ధికి ఒక సోపానముగా గీతలలో చెప్పబడినదని కొందరును, అదియే ప్రధానముగా చెప్పబడినదని మరి కొందరును యీ రెండును సోపానములు మాత్రమే గాని, జ్ఞాన మార్గమునే ప్రధాన మార్గముగ నుపపాదించునని మరి కొందరును, యెంచి, గీతకు భాష్యములు లెక్కలేనన్ని వ్రాసియున్నారు. ఎవరెట్లున్నను, మానవుడు, తన కష్ట పరంపరలను సహించజాలనపుడు, తన మనశ్శాంతి కొరకు దేవునిమీద భారము మోపుట అలవాటైపోయినది. విగ్రహారాధనకు కూడ యిదియే పునాది. ప్రథమమందు యీ ప్రకృతిలో జరుగుచున్న విషయములకు ఆశ్చర్య భయ విహ్వాలులై మానవులు, గూపోపాసన దైవ ప్రార్థనలను సహజముగ మొదలుపెట్టిరి. వీనిని మన వేదాంతులు తిరస్కరించక అవ్యక్తవిషయిక జ్ఞానమునకు యివి కూడ కొంత చిత్తశుద్ధిని గాపించి సహాయపడునని సమర్థించిరి. తుదకు యివియే ప్రధాన మని కొందరు భక్తులు, భాష్య కర్తలు వ్రాయదొడగిరి. మంత్రములు, బ్రాహ్మణములు, సూత్రములు, స్మృతులు మొదలగువానిగుండా నానాముఖముల యీ దైవ ప్రార్థనమును మనవారు పెంచిరి. ఇంతటితో తృప్తి నొందక అష్టాదశ పుక్కిటి పురాణములను యితిహాసములను అనేక పిట్ట కథలను, విద్యా విహీనులకు

నీతులు నేర్పు మిషతో అల్లిరి. విద్యాధికులు కూడ యిట్టి పిచ్చి గ్రంథములను వేద వాక్యములుగ యీ ఆధునిక యుగములో కూడ చదువుకొనుచు ఆ విషయములను నమ్మచుండుట మన దేశ దుర్దశ యని నేను భావించెదను.

జ్ఞాన మార్గము భక్తిమార్గము యీ రెండును మంచివే యనియు, అధికార తారతమ్యమును బట్టి యవి యనుసరింపబడవలెననియు మనవారు కొందరు బోధించెదరు. వీనిలో సత్యమేది యసత్యమేది యని నిర్ధారణ చేసికొని రెండవ దానిని త్యజించుటకు బదులు యిది కూడ గౌణమని వాదించుచు, రెండును త్రొక్కుచుండుట మిగుల శోచనీయము? లోక సంగ్రహార్థమే యిట్లు చేయుచున్నామని వీరు చెప్పు సాకులు యెంత మాత్రము నచ్చవు. మూఢ విశ్వాసములను పెంపొందించుటకే వీరి నడత తోడ్పడును.

ప్రపంచ చరిత్ర నెక్కడ తరిచి చూచినను దైవ ప్రార్థనల వలన, యే క్రూర జాతి మనస్సును కరగించబడినట్లు కనుపడదు. నిరంకుశత్వము అణుగంటలేదు. సామదాన భేద దండోపాయముల వలననే కార్యములు సాధింపబడినవి. ఈ ప్రార్థనల వలన యుద్ధము లాగలేదు. ప్రకృతిలో సంభవించు జల ప్రళయములు, అగ్నిపర్వతజ్వాల వర్షములు, భూకంపములు, తుపానులు, వ్యాధులు, కాటకములు దేవాలయములను కొల్లగొట్టుట, మొదలగు నరిష్టములు దైవ ప్రార్థనల వలన పోగొట్టబడలేదు. మంత్రములకు చింతకాయలు రాలునా?

సిరికి పందలై ధైర్యముతో కష్టముల నెదుర్కొనజాలక అవి యన్నియు తమ్మును పరీక్షించుటకు దైవము కలుగ జేసినా డనియు, దైవమును ప్రార్థించిన నవి తొలగుననియు, మానవులు యిప్పటికిని ప్రార్థనలను సలుపుచుందురు. కొందరు దైవమును, తమ పూర్వకర్మను దూరెదరు. కొందరు వేరు కారణముల నరయజాలక తమ యదృష్టమని (కనుపడనిదని) మనస్సు స్థిరపరచుకొనుటకు ప్రయత్నింతురు. కాని ప్రకృతి మాత్రము యెట్టి దయదాక్షిణ్యములు గాని, ఎట్టి అహంకార కార్పణ్యములు గాని లేక తన దారిని తాను పోవుచు తన పని నెరవేర్చుకొనుచునే యుండును.

గ్రహచారము వలన మనకు శుభాశుభములు కలుగుచున్నవనియు గ్రహశాంతి వలన మన దుర్దశలను బాపుకొనవచ్చుననియు మనలో మరియొక మూఢ విశ్వాసము కలదు. మనుష్యుడు జన్మించినప్పుడు అతనిశీర్షోదయ కాలములో గ్రహ కూటమిని సరిగా గ్రహించుట సాధ్యపడినను ఒక గ్రహముయొక్క క్రీగంటి చూపే మన జీవితములో నెంతయో మార్పు కలిగించిన యెడల యీ జ్యోతిష శాస్త్రము నిరుపయోగమని స్పష్టపడుచున్నది. ఇది ప్రకృతిని గాని, మన పూర్వ కర్మానుభవమును గాని యెట్లు తప్పించును? నవ గ్రహ జపములు, ప్రార్థనలు మన విద్యాధికులు సైతము చేయుట, చేయించుట, వీరి మనో బానిసత్వమును మూఢత్వమును తెలియపరచును.

దేవుడు మన జీవితము సదా స్వాయముగా నడపు చున్న యెడల ప్రకృతిలో జరుగు క్రూరకృత్యములన్నియు, ఆయన పరమదయాళుత్వమునకును, సర్వశక్తికిని లోపము కలుగజేయక తప్పదు. జీవరాసు లన్నియు ఒండొంటిని భక్షించనేల? ఈ ప్రపంచములో వానికి గలుగు అన్యాయములు, కష్టములు, వాని వాని కర్మానుభవములే యని నమ్మిన యెడల, దీనిని దేవుని కారోపించనేల? దీనిని మాన్పించుటకు దైవ ప్రార్థనలేల? అన్యాయము జయమొందుట ప్రతి దినము చూచుచు, దేవుడట్టివి యంగీకరించు చున్నాడని చెప్పవచ్చునా! ఆయన యీ నిరపరాధుల మొఱలను విని వారిని రక్షించుటకు రాడేమి! అసలు, ప్రపంచములో బాధ లెందు కుండవలెను! అందరును నీతిపరులుగ నేలయుండరు! ఒక జీవమును మఱియొక జీవము తినుట కేల యేర్పాటు చేసెను? వివిధ జాతుల వారిలో తన్నుగురించి వివిధ నమ్మకములు కలిగించి అన్యోన్య మత కలహముల నెట్లు సహించెను? నిజ మేమన ప్రకృతిలో మనకు తెలియకుండ యెట్లు పరిణామము కలుగుచున్నదో ఆయా మానవుల నీతి ప్రవర్తన కూడ కాలక్రమమున దేశ కాల పరిస్థితులనుబట్టి మారుచుండును. ఈ సృష్ట్యారంభమును గురించి యెవరికిని యేమియు తెలియదు.

---

## 7 వ అధ్యాయము

## విగ్రహారాధనము

సర్వాంతర్యామియైన ఒకపరబ్రహ్మ మున్నాడని విశ్వ సించువారు, అయన నిరామయుడనియు, నిర్వికల్పుడనియు నిరంజనుడనియు, నిరాకారుడనియు స్పష్టముగా చెప్పుచు న్నారు. మనహిందూశాస్త్రములుకూడ అట్లే ఘోషించు చున్నవి. అయినను జనులందరు సర్వసాధారణముగా తమ మనోవీథియందు ఏదియో యొకవిధమగు దేవదేవుని విగ్రహ మును ముందిడుకొని, రూపోపాసన చేయుచున్నారు. లేని యెడల ప్రార్థన కర్థమేలేదు. ఈ ప్రపంచములో నున్న ముఖ్య మతములవారిలో మన హిందువులు, బహిరంగముగ, విగ్ర హముల నుంచుకొని, వానిని పూజించెదరు. కేవలము నిర్గు ణోపాసనయందును, మంత్రధ్యానములందును వారికి తృప్తి జనించదు. అది కష్టసాధ్యమని యెంచెదరు. నిగూఢమైనట్టి వేదాంతజ్ఞానము సామాన్యమానవులకు సరిపడదు. మూర్తులు అవతారములు ప్రతీకములు మానవరూపములుగా మనస్సునం దుంచుకొనిగాని, నేత్రములతో చూచిగాని, భక్తితో ప్రార్థి నచేయుట అలవాటై పోయినది.

విగ్రహారాధనము ముస్లిములు, క్రైస్తవులు నిరసిం

చుట న్యాయము కాదని మనహిందువులు ఒక హేతువును కనుపరచెదరు. ఉపనిషత్తులలో నున్న వేదాంతజ్ఞానమును బట్టియైనను, ప్రకృతి యంతయు పరబ్రహ్మముతో నిండినప్పుడు అన్నివిధములైన ప్రతీకములలోను పరబ్రహ్మమునావాహనించి ప్రతిష్ఠచేసి వానిని నేలపరబ్రహ్మమునుగా పూజించకూడదని యడిగెదరు. సృష్టియొక్క పుట్టుకగాని, దానికర్తను గురించి గాని మనము తెలిసికొనజాలమని ఒప్పుకొన్నప్పుడు ఈయుభయవాదులు ఒండొరులను విమర్శించుకొనుటవలన లాభమేమి? హృదయావేదన కష్టసమయములలో తీరునని, యిట్టి పూజలు ప్రార్థనలు, ప్రతిమతములలోను చెప్పించబడియే యున్నవి. ముప్పదివేల సంవత్సరములనుండి, హిందువులు, చాల్డియనులు, బాబిలోనియనులు, అస్సీరియనులు, ఈజిప్టువారు ఈ విగ్రహారాధన సంప్రదాయము కలిగియున్నట్లు భూగర్భపరిశోధకులు అభిప్రాయపడుచున్నారు.

ఈ విగ్రహారాధనములో అనేకములైన మూఢవిశ్వాసములు, లేని పోనితంతులు, ఆచారములు, కర్మలు మొదలగునవి కలసి నిజమైన ప్రశాంతమైన దైవభక్తి నశించి, మిక్కిలి చోద్యమైనట్టియు, విపరీతమైనట్టియు, నవ్వుపుట్టించునట్టియు, హేయమైనట్టియు వక్రమార్గమున మనహిందువులు నడచుచుండుటచేత నీ విగ్రహారాధనను నిరసించుట ఆచారమైనది. మున్లిముల మశీదులు, క్రైస్తవుల చర్చిలు, బౌద్ధుల గుళ్లు, ఆరామములు మనదేవాలయములలోని యాడంబ

రము లేనియు లేక, ప్రశాంతస్థలములై దైవప్రార్థన కుచితము లైయున్నవి. వానిలో నేవిగ్రహము లేకపోయినను, వారిలో చిన్నలు, పెద్దలు మనలోవలెనే భక్తిపరులుగా నుండలేదా? కాబట్టి మొదట ఈ విగ్రహారాధన యనునది యేలపుట్టినది, యెప్పుడు పుట్టినది, విచారించుట మనకవసరము. దీనిపరిణామము కొంతవరకైనను మనము తెలిసికొన్నగాని దీనిలో మిక్కిలి అవసరమైన సవరణలను చొప్పించజాలము.

ప్రపంచములో అన్నిమతగ్రంథములకంటెను, అనేక వేల సంవత్సరములకు పూర్వము పుట్టిన ఋగ్వేదములో ఇట్టి విగ్రహారాధనగురించిగాని, దేవాలయములగురించిగాని యెట్టి ప్రశంసయున్నట్లు కనుపడదు. ప్రకృతిలో మానవునికి గోచరించెడు అపురూపపదార్థము లన్నియు దేవతలనియే మొదట భావించబడుచుండెను. మనమతములన్నియు, ప్రకృతినిచూచి మనవారికుండిన భయముమీాదనే ఆధారపడి తరువాత, చిలవలుపలవలువేసి వృద్ధియైనవిగాని వీనిలో నేదియు సత్యమనియు దేవుడు ఏర్పరచినదనియు ఎన్నడు నమ్మరాదు. మనఆర్యులు, ఆవేదకాలములో వర్షములు కురిపించువాడు ఇంద్రుడనియు, తేజస్సు నొసంగువాడు సూర్యుడనియు, ఉదకముల నిచ్చువాడు వరుణుడనియు, అన్నము నిచ్చువాడు అగ్నియనియు, రాత్రిని పోగొట్టునది ఉషోదేవతయనియు, ఇట్లు ఏ మేమో ఊహలు చేసికొని, ఆ యాదేవతలను గురించి ప్రార్థనలను జరిగించుచు, వానినే యీా ఋగ్వేదములో ఉదాహరించిరి.

ఉరుములు, మెఱుపులు, గ్రహణములు, భూకంపములు, తుపానులు, ఉప్పెనలు మొదలగువానికి మనుష్యమాత్రుడు భయపడుట సహజము. కాబట్టి వానికధిష్ఠాన దేవతలున్నట్లు మనవా రెంచి ఋగ్వేదములో వీరి స్తుతిగీతముల ననేకములు పాడియుండిరి. కాలక్రమముగ యీ ప్రకృతిలో నున్న సూర్య చంద్రాదులు, ఋతువులు, రాత్రింబవళ్ళు మొదలగునవి నియమము తప్పక సర్వకాలసర్వావస్థలయందును ఒకటేవిధముగ నడచుచుండుటచేత యీ దేవతలనన్నింటిని నడపించుటకు ఒక మహాదేవుడు వేరుగ నున్నాడనియు, ఆయనను ఈ దేవతలగుండానే పూజించవలెననియు ఊహించి అట్టి మంత్రముల నేర్పాటుచేసికొనిరి. తుదకు వేదములు మంత్రములు బ్రాహ్మణములు మొదలగునవి అతిక్లిష్టరూపముగ చేసి వైదికకర్మలను హెచ్చించుటచే, ఉపనిషత్తులలో, ఆదిదేవుడే ప్రకృతినంతయు నిండి యున్నాడనియు, ప్రకృతియంతయు అతనిలోనే యున్నదనియు, కాబట్టి మనలోనున్నది కూడ ఆదేవుడే, లేక ఆయన కళయే యనియు, వ్రాయబడినది. కాని యిదియంతయు వేదాంతముగాని, హైందవమతము కాదు; బ్రాహ్మణమత మంతకంటెను కాదు.

కొంతకాలమైన తరువాత (ఎప్పుడో ప్రస్తుతము నేను నిర్ధారణచేయలేను) బ్రాహ్మణశాఖవారు ఈ విగ్రహారాధనను అనేకకర్మలతో సంపుటీకరణము చేసి మానవప్రకృతిని కనిపెట్టి, అన్ని అంతస్తులలో నున్న ప్రజలకు ఉపయోగించు

నట్లు రాళ్ళురప్పలు చెట్లు పుట్టలు పాములు కోతులు మొద లగు వాని నన్నిటిని పూజించుట కంగీకరించిరి. ఇట్లు అనా గరికులైన అడవిమనుష్యుల పూజలను, దురాచారములను, బలులను అంగీకరించి, హైందవమతములోనున్న చాతుర్వర్ణ్య వ్యవస్థలో వారినికూడ క్రమక్రమముగా చేర్చదొడంగిరి. పై వాని యన్నిటిలోను దేవుడున్నాడు గనుక వానిని స్త్రీరూప ములుగాను, పురుషరూపములుగాను ఉపాసింపవచ్చుననిరి. పోలేరమ్మ పైడమ్మ నూకాలమ్మ కాళి శ్యామలమ్మ మరి డమ్మ విఘ్నేశ్వరుడు మొదలగు వికృతరూపము లన్నియు దేవస్వరూపములే యనియు, తులసిమొక్క కందపిలక రావి చెట్టు మొదలగువానినికూడ పూజించుట మంచిదేయనియు, అదివరకు ఆమూఢప్రజలలోనున్న మూఢవిశ్వాసములను మరింత పురికొల్పి తాము ఆధ్వర్యము వహించి, తమపలుకుబడిని వ్యాపింపజేసుకొనిరి. పాపము! తమస్వలాభమునకు గాక నైతికప్రవర్తనకు, భగవద్భక్తియే ప్రధానమనుకొని, సదుద్దే శ్యముతోనే మనబ్రాహ్మణులు నానావిధములైన భగవదా రాధనలను ప్రవేశపెట్టుటయేగాక ప్రతిప్రతిమను గురించియు కథల నల్లిరి. స్త్రీలకు వ్రతముల నేర్పాటు చేసిరి. పూర్వ మవతరించిన మహాపురుషులను దైవసంభూతులుగ నెంచి, వారిని అవతారములుగ చేసి వారు చేసిన ఘనకార్యము లన్నియు అమానుషమైనవిగ వర్ణించి, వారిచరిత్రలలో ధర్మ సూత్రబోధనల నిమిడ్చి, ప్రజలలో దైవభక్తిని, నీతిమార

ము పెంపొందించుటకే అనేక పుక్కిటిపురాణములను, స్థల పురాణములను వ్రాసిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సృష్టి స్థితిలయకారునియొక్క వేరు వేరు రూపాంతరములుగ నొనర్చి వారికి మానవులకువలెనే జరయు, మృత్యువునుకల్పించి, భార్యలను అంటగట్టి, వారికి కల్యాణోత్సవములు, భోజనములు, పవళింపుసేవలు, ఊరేగింపులు, గృహములు, గోపురములు, చందనతాంబూలాదులు మొదలైనవి యెన్నెన్నియో సృష్టించిరి. వీరియారాధనలకు ఆగమసూత్రములను లెక్కలేనన్ని కల్పించిరి. బౌద్ధమతమును రాజులచేత అణగత్రొక్కించిన పుడు వారిభిక్షుకుల ఆరామములను, గుహలను, మఠములను దేవాలయములుగ మార్చి అక్కడ జరుగవలసిన కర్మకలాపమునకు ప్రభువులచేత మాన్యముల నిప్పించిరి. చిత్రవిచిత్రమైన రూపములను ఈ శిలాలోహాదారు ప్రతిమల కొసంగిరి. వానికి ప్రాణప్రతిష్ఠ అనేకమంత్రములతో చేసిరి. ఆయా యవతారములకును, వారి భార్యలకును నానావిధరూపముల నిచ్చిరి. పంది, సింహము, ఏనుగు, పక్షి, కోతి, గుఱ్ఱము మొదలగు జంతువుల మూతులుగలవానిని, మూడునాలుగు తలలు, ఏడెనిమిదిచేతులు గలవానిని, ఇంకను ననేకవికృత రూపములను ఈ దేవాలయములలో ప్రవేశపెట్టిరి. భగవంతుడు తమవలెనే కాళ్ళుచేతులు మొదలగు అవయవములు కలిగియున్నట్లు కల్పించుకొనుటయేగాక, యీ ప్రతిమలను మానవునికంటె భిన్నరూపమున్న గాని మూఢులకు భక్తి

కుదురదని తమయూహలకొలది చిత్రవిచిత్రరూపములను ఈ ప్రతిమల కొసంగిరి. వీరి వర్ణనలకును, అతిశయోక్తులకును మేరలేదు. మొదట మనుష్యులు, తరువాత గుర్రములు, దున్నపోతులు, ఆవులు, మేకలు, కోళ్ళు, పందులు మొదలగు జంతువులను దేవుళ్లకు బలియిచ్చి, వారిని తృప్తిపరచుచుండిరి. ప్రశాంతముగ నుండవలసిన దేవాలయములను ఆడంబరముతో బీభత్స మొనర్చి వెర్రిమొర్రి విధానములతో నింపివేసిరి. నిజమైన భగవంతునిమీది భక్తి యిప్పుడు దేవాలయములలో నశించినదనియే చెప్పవచ్చును. అక్కడ భక్తులకు ప్రసాదము లిచ్చి రావించుటలేదు సరికదా, పొట్టకోసినను అక్షరజ్ఞానములేని అర్చకు లనేకమంది మేనేజిమెంటులో యీ దేవాలయము లుండుటచే, అవి మశీదులవలె శూన్యగృహములై యున్నవి. బాజాలు, భోగమువారు, సంతర్పణలు, రథోత్సవములు, బాణసంచాలు, నాటకములక్రింద దేవాదాయము, అర్చకులు తినగా మిగిలినది యున్నయెడల వినియోగింపబడుచున్నది.

మనలో ప్రాజ్ఞులు జ్ఞానులైనవారుకూడ, ఈ విగ్రహారాధనము తమ కవసరములేదని చెప్పుచు, లోకసంగ్రహార్థము తాముకూడ నీ ప్రతిమలను పూజించుటకు వెళ్లుచున్నామని చెప్పుదురు. వీరీ విగ్రహారాధనను సమర్థించుకొనుటకు మరియొకకథ నల్లెదరు. అక్షరములు ముందుగా నేర్చుకొని, తరువాత పెద్ద పుస్తకములను చదువగలిగినట్లు పామ

వులకు వారివారి యోగ్యతలనుబట్టి తాము వారిని నడిపించ వలసి యుండునని చెప్పుదురు. కాని తాముకూడా ప్రతిదిన ము అక్షరములు వ్రాసికొనుట తమ బాలురకొరకే యని చెప్పిన నెంత హాస్యాస్పదముగ నుండునో, ఆలాగుననే విగ్రహారాధనకు కారణమునరసి, యీ మార్గము తమ కక్కరలేక పోగా తోడిమానవులను పైమెట్టుకు తీసికొని రావలసిన ఈ పెద్దలు, మూఢులతో కలసి రొంపిలోనే ఆడుకొనుచుండుట లోకసంగ్రహమా? ఇది వెర్రిపని కాదా? ప్రజలచేత నీపిచ్చి సమ్మకములను, నీ యాడంబరములను పోద్రోలించి, తక్కిన జాతులలో వలె వీరును నిర్గుణోపాసననే అలవరుచుకొనునట్లు చేయకూడదా? మూఢభక్తిని త్యజింపజేసి, నిర్మలమైన దైవభక్తిని, జ్ఞానమును ఉపదేశించుట వీరిధర్మము కాదా?

సంఘాభివృద్ధికి కొన్నినీతులు ప్రధానము. ఈ నీతులకు పునాది, మతములు కావని నా యభిప్రాయము. ఆయా కాలపు దేశపరిస్థితులను బట్టి మన నీతిసూత్రములు పరిణామమును పొందినవి. వానిని స్థిరపరచుటకు ఈ మతములు బయలుదేరినవి. కాని, యీ మతములవలననే మూఢవిశ్వాసములు పెరిగి మనుష్యులను బానిసలుగా చేసినవి. పూర్వకాలమందు భయముచేత నీ మతసంప్రదాయములను బట్టి నరక శిక్షలను తప్పించుకొనుటకు జనులు నడుచుకొనుచుండినను నాగరికత, యింగితజ్ఞానము ప్రబలినకొలది రాజకీయశిక్షలకును, సాంఘికాపవాదములకును భయపడినట్లు, మతకారుల బెవ

రింపులకు జడియువారు లేరు. నీతినియమములు సంఘాభి వృద్ధికి అత్యవసరమని గ్రహించినవానికి దైవప్రార్థనయే అన గత్యము. చిన్నతనమునుండియు నేర్చుకొన్న అలవాటుచేను బట్టి, అనేకమంది తమకష్టసమయములలో మాత్రము పరా త్పరునిమీద భారమునంతయు మోపి, తమ యోదార్పున కును, మనోదార్ఢ్యమునకును, దేవునిప్రార్థించుచుందురు. మహా త్మగాంధీగారి దైవప్రార్థనలకుకూడ నింతే విలువనిత్తును. గుండ్రబల్ల కాన్ఫరెన్సు జయప్రదము కావలెననియు, హిందూమస్లీములకు ఐకమత్య ముండవలెననియు, మహాత్ముడు నూరుసంవత్సరములు జీవించవలెననియు, మనకు సంపూర్ణస్వ రాజ్యము రావలెననియు భగవంతుని పెద్దలందరు ప్రార్థించుట వీరిమనస్సుయొక్క బానిసతనమునే వెల్లడించు చుండును. ప్రకృతి తనమామూలుధోరణిని మానవుల యిష్టానిష్టము లతో సంబంధము లేకుండ, మానవులు మొదలగు జీవరాసుల మీద నెట్టిజాలియు, ద్వేషము లేకుండ, తనదారిని తానుపో వుచుండగా, వర్షము కురిపించుమనియు, మనుష్యుని బ్రతికించుమనియు, తిండిపెట్టుమనియు, రోగము కుదుర్చుమనియు దేవుని ప్రార్థించినయెడల ఆయన తనసృష్టి వ్యాపారములో మధ్యమధ్య మనకొరకు తాను వ్రేలు పెట్టుచు, ప్రకృతిపరిణామమునకు అడ్డుతగులుచుండునా? మంత్రములకు చింతకాయలురాలునా? యజ్ఞములచేత వర్షములు కురియునా? ఏటి మాట! మతగ్రంథములలో ఇట్టివిచిత్రము లుదాహరింపబడి

నవని చెప్పువారికి ఒకటే జవాబు. ఈ గ్రంథములు మూఢ విశ్వాసములను వృద్ధిపొందించుటకే యేర్పడినవి.

ప్రార్థనల యుపయోగము నటుంచుము. ఈ రూపోపాసన అగత్యము కాదని తెలుపుటకు ఒక్కనిదర్శనము చాలును. బౌద్ధుల, క్రైస్తవుల, ముస్లీముల పసిబాలురు సహితము ముక్కు, చెవులు, కాళ్ళు గలిగినప్రతిమలను పూజింపక యెట్లు భగవద్భక్తిని కలిగించుకొనుచున్నారు? ప్రకృతియంతయు చూచి దేవుని కల్యాణగుణములను కీర్తించకూడదా? వారందరును భగవద్భక్తి గలిగి సత్పథమును త్రొక్కుచుండుట లేదా? భగవంతుడు లేడని వాదించు బౌద్ధులు, చార్వాకులు మొదలగు నిరీశ్వరవాదులు మనవారికంటె నీతిబాహ్యులా? మనచిన్నతనమునుండి పుక్కిటిపురాణకథలన్నియు వేదవాక్యములనియు, బ్రహ్మ, విష్ణు, శివాదులుగను మరి యింక ననేకావతారములుగను పరబ్రహ్మ మెత్తెననియు, వీనిలో ఎవరియష్టముచొప్పున నే దేవతను ప్రార్థించినను దేవదేవునికే చెందుననియు, బోధించుటకు మొదలు పెట్టగానే, స్వీయాలోచనశక్తి, మనస్స్వాతంత్ర్యము, హేతువాదన, మొదలగునవి నశించి మనము మూఢవిశ్వాసములకు లోనై పూర్వగ్రంథములలో వ్రాసిన ప్రతివిషయములు నమ్మితీరవలెననియు, నమ్మనియెడల ముప్పు వాటిల్లి నరకమున బడుదుమనియు అధమాధమజన్మముల నెత్తుచుందుమనియు భయపడి బానిసలముగ, మతకర్తలచే చేయబడితిమి. మనము పెద్దవారమై

విద్యావంతులమైనను చిన్నతనములో ఉగ్గుపాలతో, అమ్మ ఒడిలోనుండియే నేర్చుకొనిన యీ పచ్చిపుక్కిటి పురాణము లలో అతిశయోక్తులేవో, నిజమైనచరిత్రాంశము లేవో గ్రహించజాలక శుద్ధచ్ఛాందసులగు మూఢవిశ్వాసపరులమగు టయో, లేక వీని యన్నిటియందును అపనమ్మకము కలిగి వీనిని బొత్తిగా త్యజించుటయో సంభవించుచున్నది. మన నిజమైన ఆర్యమతమేమో యిప్పటికి మనకు తెలియదు. గ్రుడ్డెద్దు చేనబడ్డట్లు విమర్శనజ్ఞానమును చంపుకొని, మూఢ మతవిశ్వాసము లన్నిటికిని దాసులమై పోతిమి.

చిన్నపిల్లలకైనను సత్యము మరుగుపరచి పిట్టకథలను, దయ్యపుకథలను బోధచేయుట వారిభవిష్యజ్జీవనమునకు మిక్కిలి భంగకరము. రామకృష్ణాద్యవతారములు ఆయాకాల ములయందు గొప్ప ప్రతిభావంతులైన మనుష్యులనియు, వారిలో కొన్నిలోపములున్నను, మొత్తముమీద ఆదర్శప్రాయ మగు నడతను కలవారని గ్రహించి, వారికథలను చదువుకొన వచ్చునుగాని, వారే పరబ్రహ్మమని యెంచకూడదని బోధించవలెను. ఈ పిచ్చిపిచ్చి మానవవిగ్రహపూజను త్యజింపజేయ వలెను. ఈ నాయభిప్రాయములకు పూర్వాచారపరాయణు లేగాక కొందరు నవనాగరికులమని విర్రవీగు విద్యాధికులు కూడ నన్ను దూషింతురని నే నెరుగుదును. కాని వీరి కోప ప్రసాదములకును, దూషణభూషణలకును నేను వెరువక, నా మనస్వాతంత్ర్యమును విడువక నాకు సత్యమని తోచినదానిని

నిర్భయముగ వెల్లడించుచున్నాను. ఈ యవతారములకు చావుపుట్టుక లున్నవిగనుక వీరు పరబ్రహ్మము కానేరరు.

"కల్పేకల్పే క్షయోత్పత్త్యా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః,
శ్రుతిస్మృతిసదాచార నిర్ణేతారశ్చ సర్వదా"—పరాశర
[స్మృతి.

భావము:—త్రిమూర్తులు ప్రతికల్పాంతమున నశించి మరల పుట్టుచుందురు.

ఈ యవతారపురుషు లందరు మనవలెనే పాపములు చేసిన మనుష్యమాత్రులేకాని వేరుకారు.

"ఇంద్రో నారాయణో బ్రహ్మ హ్యన్యభూయ అతిక్షయమ్,
తేపి దోషా దుపహతాః పదభ్రష్టా విచేతనాః,
కాలేన మహతా చైతే పాపాత్ స్థానం ప్రపేదిరే."
—స్కాందపురాణము.

భావము:—ఇంద్రుడు, నారాయణుడు, బ్రహ్మ—వీరుకూడ పాపము చేసి తమ ఉన్నతపదవులు గోలుపోయి దీర్ఘకాలము పాపఫల మనుభవించి చిట్టచివరకు స్వస్థానముల చేరిరి.

త్రిమూర్తులనుగాని, వారి యవతారములనుగాని ఆరాధింపుమని వేదములు విధించుట లేదు. వానిని కొల్చువారు నరకములో పడుదురనికూడ దేవీభాగవతములో నున్నది—

"నవిష్ణూపాసనా నిత్యా వేదే నోక్తాన కుత్రచిత్,
నవిష్ణుదీక్షా నిత్యాస్తి శివస్యాపి తథైవచ.

గాయత్రీమంత్రనిష్ఠాతో ద్విజో మోక్షమవాప్నుయాత్,
విహాయ తాంతు గాయత్రీం విష్ణూపాస్తిపరాయణః,
శివోపాస్తిరతో విప్రో నరకం యాతి సర్వదా.

భావము :— వేదములు గాయత్రి నుపాసింపుమని విధింపుచున్నవి. విష్ణువునుగాని, శివునిగాని ఉపాసింపుమని యెచ్చటను చెప్పుటలేదు. గాయత్రి నుపాసింపక విష్ణువును గాని, శివునిగాని ఉపాసించువారు నరకమున బడుదురు.

ఇట్లు భాగవత భారతపురాణములలోనే భేదాభిప్రాయములు కనుపడుచుండగా వీనిలో వేనిని నమ్మవచ్చును? వీనినన్నిటిని సమన్వయముచేసి, శ్రుతిస్మృతిపురాణేతిహాసము లన్నియు వేదవాక్యములుగ నమ్మవలసినదే యని సమర్థించుటకు మనపూర్వాచారపరాయణులకు పెట్టినది పేరు. వీరు అపార్థములు, నూతనార్థములు, విపరీతార్థములు, ఎన్నియైనను తమవాదనను బలపరుచుటకు చేయగల సమర్థులు. సంస్కృతభాషకూడ వీరికి తోడై, మెట్లు విరిచిన నట్టు లగుచుండును. సరళార్థము వీరికి గిట్టదు. తమతమ సంప్రదాయానుసారముగ మాటల కర్థములను లాగెదరు.

విగ్రహారాధనము ఉపయోగములేనియెడల మనమేల ఈ దేవాదాయ సంరక్షణకు పాటుపడవలెనని కొంత రడుగవచ్చును. ఇప్పటి విగ్రహారాధనయు, అడంబరములు సోమరులకు సంతర్పణలు, మూఢార్చకుల అధ్వర్యము దేవాలయములలో అమాంగళ్యపుపనులు, మొదలగువానిని, పోగొట్టి మన

దేవాలయములు ప్రశాంతమైనవిగను, పవిత్రస్థలములుగను చేసి పై చెత్తనంతయు త్రోసివేసి అడుగున నార్యమతములో నున్న మణులు మాణిక్యములవలెనుండు మన జ్ఞానవిజ్ఞానసంపదను పరిశోధనలవలన బయటకు తెచ్చుటకు ఈ దేవాదాయము ఉపయోగపడునని ఆశతోనే ప్రస్తుతోద్యమము ప్రారంభింపబడినది. దీని పర్యవసాన మెట్లుండునో యెవరు చెప్పగలరు?

---

## 8 వ అ ధ్యా య ము

### పి త రు ల యా రా ధ న ము

చనిపోయిన మనిషి దయ్యమై యుండునను భావముతో, నీ పితృపూజ అన్ని జాతులలోను మొదట పుట్టినది. దయ్యముల యందుండు భయమే, ఈ పితృపూజకు పునాది. ఈ భయమే, ప్రథమమున చనిపోయిన వారికి గోరీలు కట్టుట, వారిని పూజించుట మొదలగు కార్యములకు పురికొల్పినది. ఇట్టివే, కొంతకాలమునకు దేవాలయములై, వివిధములైన పూజలకు ఆకరములైనవి. మొదట ఈ పూజలు శవములకే చేయుచుండిరి. కొంతకాలమునకు, ఆ శవములను, ఒక విధమైన నూనెలో నుంచి, ఈ జిప్టు దేశములో కుళ్లిపోకుండ

నిలువ యుంచుట ఆచారమైనది. తరువాత శవములయొక్క వివిధావయవములను మాత్రమే, యెముకలు, వ్రేళ్లు, గోళ్ళు, వెండ్రుకలు, బూడిదె మొదలగునవి పాతిపెట్టుకొని, వానిని పూజించ నారంభించిరి.

చనిపోయిన మనిషికి, అపరకర్మలు చేయుట మన హిందువులలో ప్రధాన విషయముగ నెంచబడుచున్నది. మొదట ఆ మనిషి యందుండు ప్రేమ, దయ, దాక్షిణ్యముల వలననే, యివి యేర్పడినను, రాను రాను వానిని బలవంతము మీద ప్రతివాడును చేయక తప్పదయ్యెను. ఈ కర్మలకు ధర్మశాస్త్రము లేర్పడి, మతముతో సంపుటీకరణ మొనరించుటయే గాక, న్యాయశాస్త్ర ప్రకారము దాయక్రమమునకు కూడ వర్తించునట్లు మన వారు చేసిరి. ఈ పితృపూజ యేదియో యొక విధముగ అన్ని దేశములలోను, అనేక వందల శతాబ్దముల క్రిందట నుండి ప్రచారములో నున్నది. సమాధి మీద తఱచుగా పుష్పములు వేయుచుండుట పాశ్చాత్యులకు ఆచారమై యున్నది. ఇది పితృపూజగాక మరి యేమి?

చనిపోయిన వారి తుది కోర్కెల ప్రకారము నడచుకొనుట, వారి యాత్మలు మనకు ఉపకారాపకారములను చేయుననుకొనుట, ఆ యాత్మలు వారిని ఖనన దహనములు జరిగినచోట నుండుననుకొనుట, వారికి తిండి పడవేయుట, వారికి గుళ్ళు గోపురములు కట్టించుట, ఈ మొదలగు పనులు జరుపుకొనుచుందురు. యూరపుఖండ క్రైస్తవులు

తమ చనిపోయిన పూర్వులందరు ప్రళయకాలము వరకు ఒక పాపవిమోచన లోకమందుందురనియు (Purgatory) వారికి స్వర్గసౌఖ్యము రాగలందుకు ప్రార్థనలు, పూజలు సేయుచుందురు. క్రైస్తవుల All Souls Day, మన పితృపిండయజ్ఞము వంటిదే.

చనిపోయిన వాని ఆస్తికికర్త వానియాత్మకు పిండప్రదానము చేయువాడే. ఎవడట్టి పనికి తగునో మన దాయక్రమము తెలుపుచున్నది. పూర్వము, రోము, గ్రీసు, యింగ్లాండు, స్కాట్లండు, మొదలగు దేశములలో కూడ యీవిధానముండెను. మన హిందువులలో, చనిపోయిన వానికి అంత్యకర్మలను చేయుటకు అర్హులైన వారికి మాత్రమే అతని యాస్తి చెందగలదు. అట్టి సమీపవారసులు, ఆతనికి తప్పక యీ కర్మనంతయు చేయవలెను. అట్లు చేయనియెడల, అతని యాస్తి చెందకూడదు. వారసు లెవరును లేనియెడల రాజే సదరాస్తిని తీసికొని కర్మను విధిగ చేయించి తీరవలెను.

ఈ అపరకర్మలు, నానా దేశములలో నానావిధమైన రూపములను దాల్చినవి. వాని నన్నిటిని వర్ణించుట ప్రస్తుతమనావశ్యకము. యజుర్వేదములో శవము నోటిలో బంగారపు నాణెమును వేయవలసినదని చెప్పబడినది. దీనికి కారణమేమనగా, దూరయాత్ర సలుపునపుడు, పాంథుడు, బియ్యము తినుబండారములు, మొదలగునవి కొనుక్కొనుటకు కొంత సొమ్మునెట్లు తీసికొని పోవలసియుండునో, ఆ విధముగనే,

చనిపోయిన వానికి కూడ కావలయునని యిట్టి సామానులు వాని అంత్యకర్మలపుడు, వారి పేరుమీాద యిచ్చుచుందురు. గ్రీకులు, రోమనులు, పారశీకులు, ఒకమనిషి చనిపోయినప్పుడే గాక, ప్రతి సంవత్సరము కొన్నికొన్ని దినములలో, అతని సమాధియొద్ద పుష్పములు, భోజనసామగ్రి, బలులు మొదలగునవి వేయుచుందురు. పారశీకుల పంచయజ్ఞములు, హిందువుల శ్రాద్ధకర్మలవంటివే. చనిపోయిన వారి యాత్మలకు శాంతి కలుగుటకు కొన్ని మంత్రములను చదువుదురు. వారు అపరకర్మలకు యెంతయో ధనము వెచ్చింతురు. వారుపెట్టిన భోజనసామగ్రి యెంతమాత్రము తరుగనందున, ప్రేతములు వాని వాసన ననుభవించి పిప్పిని వదలివేయుచున్నవని వారి నమ్మకము. ఇట్లు తిండి పెట్టుటకు వారికి పిల్లలు లేనియెడల ఆకలితో చనిపోయిన వారి యాత్మలు బాధపడుచు తిరుగుచుండునట! పిల్లలు లేనివారి యాత్మ శాంతికి ప్రభుత్వమువారును ధర్మాత్ములును భోజనశాలలు నిర్మించి పుణ్యము కట్టుకొందురట! ఈ జిప్టులో చనిపోయినవారి శవములను నిలువచేయుదురు గాని హిందువులవలె వానిని యేటేటను పూజించరు. మన సాంవత్సరిక శ్రాద్ధకర్మలవంటివి వారికి లేవు.

ఆర్యులందరికిని మొదటి గ్రంథమగు ఋగ్వేదములో పితృపూజను గురించి కొద్దిగా మాత్రమే చెప్పబడియున్నది. ఇటీవల బ్రాహ్మణములలో నుదహరించబడిన శ్రాద్ధకర్మ

లేవియు దానిలో కనుపించవు (ఋ. 10 మం-16-10) ఈ ఒక్క-చోటనే చనిపోయిన వానికి చేయవలసిన కర్మ చెప్పబడినది. దుంపలు, ఫలములు, పాలు, వెన్న, చనిపోయిన వానికి పెట్టుటకు వారి నాహ్వానించి వారు కూర్చొనుటకు దర్భలు పరచవలెను—ఆ ప్రేతములు, తమ పిల్లలమీద గల దయతో వచ్చి భోజనము చేసి, వారిచ్చిన పానీయములు త్రాగి వెళ్ళిపోయెదరు. అట్లువచ్చిన వారందరిని పితరులనియే వాడెదరు గాని, యిప్పటివలె తండ్రి, తాత, ముత్తాతలకు పిండములను, వారి పైవారికి కొన్ని మెతుకులను, యింకను పైవారికి ఉదకములును యిచ్చు పద్ధతి ఋగ్వేదకాలమున లేనే లేదు. అసలు ఈశరీరాంత సంస్కారము, అనగా అంత్యేష్టికర్మగాని, పిమ్మట ఆ శరీరమునకు మరే సంస్కారముగాని చెప్పబడి యుండలేదు. భస్మాన్తంగ్ శరీరమ్" యజు. అం. 40. మం 15 నిషేకాది శ్మశానాంతో మంత్రైర్యస్యోదితో విధిః॥ (మను) అర్థము:- ఈశరీరముయొక్క- సంస్కారముగాని, అది భస్మమగు వరకు గలదు. శరీరమున కారంభము ఋతుధానమును, అంతమందు మృతకర్మయు నైయున్నది. ఇటీవల గరుడపురాణాదులందు దశరాత్ర యేకాదశాహతధాసపిండీకర్మలు, మాసిక వార్షిక గయాశ్రాద్ధాదిక్రియలు వ్రాయబడియున్నవి. ఇవి యన్నియు మిథ్యావాదములనియు, వేదములందట్టి కర్మలకు విధానము లేదుగాన నవి యకర్తవ్యమ్మలనియు, మృతినొందిన జీవుని సంబంధము పూర్వసంబంధులతో నేమియు నుండదనియు

అశ్లే ప్రస్తుతము జీవించియున్న సంబంధులదికూడ నుండద నియు, ఆ జీవులు తమ కర్మానుసారముగ జన్మించి గిట్టుచు న్నారనియు, వేదప్రామాణ్య సూత్రమును శిరసావహించిన దయానంద సరస్వతులవారు వ్రాసి యున్నారు. ప్రేతము నకు చేయు కర్మవిధిని గురించి, ఆశ్వలాయన సూత్రము ఆ 4-కం 1-సూ 6-17 తధా-క్రం 2-సూ6; ఆ4-కం3 సూ25-26 చూడుడు. అప్పుడు చదువవలసిన వేదమంత్రములు ఋగ్వే దము 10 మం-సూ16 మం 3,4,5,7,13 మం 10 సూ20 మం 9 యజు ఆ 30; కాం 18, సూ 2; తైత్తిప్రసా 6 అను 1-10 చూడుడు. వీనిలో చెప్పిన 121 ఆహుతులను, శరీరము భస్మ మగు వరకు నొనర్చవలెను. మృతునకు దాహకర్మయు- అస్థి సంచయనమును తప్ప మరి యేకర్మయు కర్తవ్యము కాదని స్పష్టముగ తెలిసికొనవలెను. ఇష్టముంటే తాను సంపన్ను డైన యెడల తన జీవితమందేగాని, తన మరణానంతరము తన సంబంధువులుగాని వేదవిద్యకొరకును వేదోక్త ధర్మ ప్రచారము కొరకును, అనాథుల పాలనము కొరకును, వేదో క్తధర్మోపదేశముల ప్రవృత్తి కొరకును యెంతధనము నైనను దానము చేయవచ్చును. ఇది చాల యుత్తమమైన కార్యము. (స్వామి దయానంద సరస్వతి వారి షోడశ సంస్కారవిధి)-

ఋగ్వేదము తరువాత సుమారు నాలుగు శతాబ్దము లకు పుట్టిన యజుర్వేదములో, పితరు లను సామాన్యశబ్ద మును విడచి తండ్రి, తాత, ముత్తాతల పేళ్ళమీదనే పిండ

ప్రదానము చెప్పబడినది. ఋగ్వేద కాలములో పితరులను రమ్మనుమని ప్రార్థించుట తప్ప యిప్పటి క్లిష్ట రూపకమైన కర్మకాండ యెంతమాత్రము కనుపడదు. శ్రాద్ధమను శబ్దమే ఋగ్వేదములో కాని, యజుర్వేదములో కాని లేదు. పితరులను శబ్దమునకు నూతనార్థము కల్పించినది యాజ్ఞవల్క్య మహర్షి. ఈయన యిటీవల స్మృతికర్తయగు యాజ్ఞవల్క్యుడు కాడు. ఈ మహర్షి గొప్ప సంఘ సంస్కారిగా ఆ కాలములో నెంచిరి. ఈయన వ్రాసిన దానిని మన బ్రాహ్మణులు తరువాత నింకను పెంపుజేసిరి. ఈ ఋషియొక్క వాజసనేయ సంహితలో పితరుల నాహ్వానించి, వారికి నివేదన చేసి, వారి దీవనలు పొందు స్వల్ప కర్మకాండనే, యిటీవల ననేక విధములుగ పెంచ బడినది. ఆయన శతాతప బ్రాహ్మణములో పితృలోక మనునది యొకటియున్నదని వక్కాణింప బడినది- ఋగ్వేదములో, పరలోకమందు, మన భౌతిక సుఖముల వంటివే, యెల్లప్పుడుండునని వ్రాయబడెను. (మం 9-113-7.) కాని యాజ్ఞవల్క్యుల శతాతప బ్రాహ్మణములో, యింద్రియ సుఖములు కోరికలులేనిజ్ఞానులకు మాత్రమే యిట్టి పరలోక నివాసము లభించునని వ్రాయబడెను. (శత V-4 15) ఋగ్వేదఋషుల భౌతిక సౌఖ్యములు, వేదాంతులగు యజుర్వేద ఋషులకు రుచించలేదు. కాని, మొదటి వేదములోని వాక్యార్థములోనే, రెండవదానిలో చెప్పినదంతయు యిమిడి యున్నదని సమర్థించుకొనిరి. ఆయా వేదములకు సంహి

తము లనునవి యేర్పడినవి. వీనిలో మంత్రములు వ్రాయబడి యుండును. వీనికి ప్రత్యేక ప్రత్యేకముగ బ్రాహ్మణము లేర్పడి యున్నవి. వీనిలో పై మంత్రములకు వ్యాఖ్యలును, కర్మాచరణ విధానమును తెల్పును. ఋగ్వేద యజుర్వేదములలోని యసలంకృతమైన పితృపూజను, బ్రాహ్మణములలో క్లిష్ట రూపకముగ పెంచి యిక ముందు వారివలన నిర్మింపబడు శ్రాద్ధకర్మలకు పునాదుల నేర్పరచిరి. ఈ బ్రాహ్మణములు కూడ మంత్రములంత ప్రామాణ్యములు కావు. ఋగ్వేద సంబంధమైన ఐతరేయి బ్రాహ్మణములో పితృపూజను నిర్బంధముగా విధించి పితరులకు కొన్ని హక్కులను కలిగించిరి. ఈ వేదములకు చాలా కాలము జరిమిలాను యేర్పడిన సూత్రకాలములో (600-200-B-C) పైన చెప్పిన కర్మకాండను కూడ వృద్ధిపరచి చనిపోయిన వానికి చేయు అపరకర్మను, సాంవత్సరిక కర్మగా మార్చి వేయబడినది. ఆశ్వలాయన, ఆపస్తంబ బోధాయన గృహ్య సూత్రములను చదివి చూడుడు. మంచి బ్రాహ్మణుడు దొరికినపుడెల్ల శ్రాద్ధములు పెట్టుచుండవలెను. ఆ భోక్తల నోళ్ళే అగ్నిదేవుడు. మన మానవులనందరిని తరింప జేయుటకే, మనువు యీ శ్రాద్ధ కర్మలను పైకి లేవదీసినాడట. ప్రతినెలలో కృష్ణపక్షములో, వీనిని చేయుచుండవలెనట! అట్లు చేసిన యెడల మనకు ధనధాన్య సంతానాభివృద్ధి కలుగునట! నువ్వులు, బియ్యము, నీళ్ళు, దుంపలు ఫలములే గాక, ముఖ్యముగా కొవ్వుతో నిండిన

గొడ్డు మాంసము, అడవి జంతువుల మాంసము పితరులకు పెట్టవలెనట! ప్రతిదినము యిట్లుచేసి, భోక్తలను తృప్తిపొందించుచున్న యెడల, ఆ పితరులకును మనకును యింకను శ్రేయస్సు కలుగునట! ఎవరెవరిని శ్రాద్ధకర్మలలో భోక్తలుగ పిలువకూడదో యీ విషయమై అనేక నిబంధనలు యీ సూత్రకారులు కల్పించిరి.

---

## 9 వ అ ధ్యా య ము

### నీ తి ని య మ ము ల ప రి ణా మ ము.

నీతి శాస్త్రము, మానవుడు తన సోదరులతో కలసి మెలసి యున్నపుడు, అతని ఆలోచనలు, చిత్తవృత్తులు అనుభవములు, చేష్టలు మొదలగు వానిని గురించి సంబంధించిన శాస్త్రము. ఇది మంచి చెడ్డలను వేరు పరచి సంఘము యెదుట ఉత్కృష్టాదర్శముల నుంచి, ఆ సంఘములోని వ్యక్తులు ఒండొరుల యందు నడచుకొను విధులను తెలియచేయును. ప్రతి సంఘము, వేరు వేరు నైతిక ప్రమాణములు, వేరు వేరు ధర్మ శాస్త్రములు కలిగి యుండును. వానిలోని వ్యక్తులు సదరు ప్రమాణములకు ధర్మశాస్త్రములకుభిన్నమైనఅభిప్రాయ

ములు కలిగి యుండవచ్చును. ప్రపంచములోని జాతులలో నివి యేవిధముగా నున్నవియు, యెట్లు పరిణామమును పొందినవియు తెలియచేయు నీతిశాస్త్ర చరిత్రను వదలివేసి, మానవకోటిలో అసలు యీ నీతి నియమము లెట్లుద్భవించినవి యను విషయమును గురించిన చర్చయే నీతి నియమ పరిణామశాస్త్ర మని యెంచుకొనవలెను.

అనేకవేల శతాబ్దములకు పూర్వము మనుష్యులు వానరముల నుండి యుద్భవించినపుడు, నీతి యను విషయమును బొత్తిగా ఆలోచన చేసి గ్రహించకపోయి యుండవచ్చును. మొట్టమొదట నైతిక సూత్రములను గ్రహించి వానిని ఆచరణలో మానవుడు పెట్టియుండడని మనయూహ తప్ప, ప్రత్యేకముగ నితర ప్రత్యక్ష సాక్ష్యము దొరకనేరదు. పసిబిడ్డల చేష్టలును యిప్పుడు ప్రపంచములో అక్కడక్కడ కనిపించు అడవి జాతుల నైతిక సాంప్రదాయములును, యీపై యూహకు ఆధారములు. పూర్వము అనాగరికులుగ నున్న అడవి మనుష్యులకు గాని, వారి పూర్వులగు వానరములకు గాని, ఏవిధమైన నీతియు లేనే లేదని చెప్పము గాని వారు బాగుగా సాధక బాధకముల నాలోచించి నైతిక మార్గము నవలంబించ లేదని మాత్రము నిష్కర్షగ చెప్పవచ్చును. మన మనఃఫలకముల మీద, పుట్టుకతోడనే దేవుడు నైతిక సూత్రములలో కొన్ని ముఖ్యమైన వానిని చిత్రించెనని చెప్పు మాటలు బొత్తిగా విశ్వసించ తగినవి కావు. సంఘములో

తాను జీవించుటకు తోడ్పడ గల మార్గములే మానవుడు స్వాభావికముగ త్రొక్కుచుండెను. స్వసంరక్షణయే, వాని నీతికి పునాది. బహుశః వ్యక్తియొక్క స్వసంరక్షణకంటె సంఘ రక్షణకొఱకే ముందుగా నీతిసూత్రములుకొన్ని ఆచరణలోనికి వచ్చుటకు ప్రారంభమై యుండును. సాంఘిక నీతి, కొన్ని ఆచార ములు, కట్టుబాట్లు, మత నియమములు, సాంప్రదాయము లతో నిండి యుండును. వ్యక్తులలో విచారణ శక్తి వృద్ధి యైన కొలది సదరు నైతికమార్గములవలన కలుగు లాభము లను, వారు గ్రహించు చుందురు. తన పిల్ల పోషణకును, వాని సంరక్షణకును, తన కడుపు కట్టుకొని యైనను తల్లిఅనేక బాధల ననుభవించుట జంతువులలో చూచుచున్నాము. ఇట్లు సహజ జ్ఞానమునకు అనుశ్రుతముగా వచ్చు సాంప్రదా యములు, ఆచారములు, విచారణశక్తి తోడైనప్పుడు స్వార్థ త్యాగముయొక్క లాభములు, సంఘములోని వ్యక్తులందరికిని వెల్లడి యగుచుండును. వారి మనస్సులకు, యీ నైతిక విధు లను తప్పక ఆచరణలో పెట్టవలెనను నిర్బంధము కూడ గోచరించు చుండును.

మానవుని సౌఖ్యము, తన సోదర మానవుల సాను భూతి ఆ మోదములమీద నాధారపడుననియు, కాబట్టి నీతికి యిదియే ప్రధాన కారణమనియు కొందరు శాస్త్రజ్ఞుల యభి ప్రాయము. ఇట్లు యితరుల సానుభూతిని, ఆమోదమును అపేక్షించుట కూడ నతని స్వార్థముకొఱకే. ఈ కోరికలు

క్రమక్రమముగా అలవాట్లు క్రింద యేర్పడి పోవును. అటు తరువాతగాని తన విచారణ శక్తిచేత తన నడతకు తగిన హేతువులను కల్పించుకొన జాలడు. ఇతరులకు తనచేష్టలు అయిష్టముగ నుండుననే భయమున్ను, వారి యామోదమును బడయవలెనని కుతూహలమున్ను, వీనిని వర్ధిల్లచేయును. సంఘమునకు సంభవించు ఫలితములను బట్టియే, వ్యక్తియొక్క కార్యముల మంచి చెడ్డలను అతని సంఘము నిర్ణయించును. ఆ సంఘము, యితర సంఘముల కష్టనిష్ఠురములనుగాని, తనలోని వ్యక్తులను గురించిగాని, యెంతమాత్రము ఆలోచించదు. మరికొందరు శాస్త్రజ్ఞులు, కృతజ్ఞత, పగసాధించుట మొదలగు చిత్తవృత్తులు నీతికి సహజమైన పునాదులని చెప్పెదరు. గొప్పవానిని అనుకరించుట మానవుని స్వభావము గనుక, ఆవిధముగ కూడ వ్యక్తులలో నీతివర్ధిల్ల వచ్చును. ప్రముఖుల నడత వ్యక్తికి మార్గదర్శకమై అతని నైతికశిక్షను పెంపొందింప వచ్చును. వారి యాజ్ఞలను తాను శిరసావహించుటకు మొదట కుతూహలపడుచుండును. తరువాత అవి అతనికి విధ్యుక్తములుగానే యేర్పడుచుండును. కాబట్టి వ్యక్తులకు పుట్టుకతో కలుగు మనోభావములు, వారి నావరించి యుండు ప్రకృతికి సంబంధించిన పరిస్థితులు, సాంఘికాభ్యాసములు ఆచారములు, ఆదర్శములు, సంస్థలు, సాంఘికశిక్షలు, యీ మొదలగు వానిమీద నీతి నియమము లాధారపడుచుండును.

సాధారణముగా, సాంఘికనీతి, వ్యక్తుల నీతికంటె ఉన్నతాదర్శమును కలిగి యుండుటకు ఒక ముఖ్యకారణ మున్నది. ఆలోచనపూర్వకముగనో, అనాలోచనతోనో, వ్యక్తులు కృత్రిమబుద్ధి నుపయోగించు చుందురు. వీరికి మనస్సులో నెటులున్నను, బయటకు మాత్రము నీతిమార్గమును ఒప్పుకొన్నట్లు నటించెదరు. తమరు లోలోన దాని నుల్లంఘించ దలచుకొన్నను, యితరులు మాత్రము నైతిక పథమును విడనాడ కూడదని వాదు వాదించుచుందురు. తాము ఆచరణలో కొరవడినను, యితరుల నడతను విమర్శించి వారిని నిరసించు చుందురు. నైతికాదర్శములను ప్రతివాడును అంగికరించుచు వానిని తనకుగాక యితరులకు వర్తింప జేయుచుండును. ఇట్లు ఉన్నత సాంఘిక సాంప్రదాయములు వ్యక్తులలోగాక, సంఘము మొత్తముమీద నేర్పడు చుండును. కాని, యివికూడ కాలక్రమమున ప్రతిసంఘములోను మారుచుండును. నైతికప్రమాణములు, ఆయా సంఘ పరిస్థితులను బట్టి పరిణామమును బొందుచుండును. కొన్ని అడవి జాతులలో అన్యజాతులను వంచించియైనను వారి శిరస్సులను ఖండించి, మొలలకు కట్టుకొనని మగవాండ్రను తృణప్రాయముగ జూచు నాచారము కలదు. ఈ హంతకవిద్యను వారి పిల్లలకు చిన్నప్పటి నుండియు నేర్పెదరు. మన ప్రస్తుత నాగరిక సంఘములలో, న్యాయ శాస్త్రములు, న్యాయ పరిపాలనము, విద్య, మతము, దయాదాక్షిణ్యములు పెరిగి, పైన చెప్పిన

యాచారము పోయినది. తుదకు అంతర్జాతీయ ధర్మశాస్త్రము, రణరంగములో గూడ మనము పాటింప వలసిన విధులను నైతిక ధర్మములను విశదీకరించు చున్నది.

కాబట్టి ఒక సంఘములో, వ్యక్తులెట్టి వివిధాభిప్రాయములు నైతిక విషయములలో కలిగి యున్నను, సంఘమొత్తము మీద నైతికమైన కొలత బద్ద యొకటి యుండితీరును. దానిని బట్టియే చట్టము లేర్పడు చుండును. మన శారదా శాసన మిట్లే యేర్పాటు చేయబడినది. సనాతన ధర్మవాదుల మని చెప్పుకొనే వారు తమ మతము అధోగతి పాలు కావించబడుచున్న దని యెంత మొరలిడుచున్నను, యీ స్వాభావిక జన్యమైన త్రోవను ఆధునిక సంఘము నడువక మానదు. ఏ వ్యక్తియైనను, తనకు తోచినట్లు నడచుటకు ప్రయత్నించినను, సంఘములోని సాంకేతిక తత్వము, అనగా సంఘ సమ్మతము, ఆతనిని అడ్డగించి, ఆతనిచేష్టలు అవి నీతికరమైనవని అభిప్రాయమిచ్చుచుండును. ఒకప్పుడు ఆతనిని సాంఘిక శిక్షలకు లోను గావించు చుండును. ఈ సాంకేతిక తత్వముకూడ మారుచుండును. ఒకానొకప్పుడు, దిగంబరులుగా నుండి, తరువాత ఆకు అలములు నడుములకు కట్టుకొని కొంతకాలమైన తరువాత శరీరమంతయు వస్త్రములతో కప్పుకొనుట సంభవించినది- వస్త్రవిసర్జనము చేసిన వానిని అడవి మనిషిగాను, పిచ్చివానిని గాను, లేక అవినీతిపరునిగాను అధునిక సంఘము లన్నియు యెంచు చున్నవి?

మొకట తల్లి తన పిల్లలమీద కనుపరచు సానుభూతి గుణమే, తల్లినుండి బంధువులకును, స్నేహితులకును, జాతికిని, దేశమునకును, తుదకు మానవజాతి కంతకును కూడ వ్యాపింపజేయ బడుచున్నది. కొందరు వ్యక్తులు, దీనిని స్థావర జంగము లన్నిటి మీదను వర్తింప జేయుట కూడ మనము చూచుచున్నాము. క్రమ క్రమేణ స్వార్థము కంటె స్వార్థ త్యాగమే ఉత్కృష్టాదర్శమని జనులు గ్రహించుచున్నారు. ఇది మన ఋగ్వేద కాలమునకు పూర్వమే ఆచరణలో పెట్టబడి యుండెను. ప్రస్తుత నాగరిక జాతులలో నెల్ల సాంఘికాభివృద్ధియే ఆదర్శముగా నుంచుకొని స్వలాభమును పరిత్యజించు చున్నారు. మానవుడు ప్రపంచములో నుద్భవించక మునుపే, స్వసంరక్షణకు సంఘరక్షణయే అవసరమని, అడవి జంతువులు, మందలుగా కూడి సంచరించుటయే తార్కాణము. ఇట్టి సంఘసహవాసము లేని యెడల మనుష్యుడు అడవి జంతువుల బారి నుండి, తప్పించుకొని జీవించలేకనే యుండును. వ్యక్తియొక్క ప్రాణధనములను రక్షించునది సంఘమే. వ్యక్తి తన సంఘనియమములకు లోబడి యుండుటకు కారణ మిదియే. ఇట్లు సంఘమునకును, దానిలోని వ్యక్తులకును అన్యోన్య సంబంధముండుట చేతనే, సంఘము స్థిరముగ నిలచియుంటూ క్రమముగా అనేక విధములైన మార్పులు దానిలోకూడ మనకు గోచరించకుండగానే జరుగుచుండును. సంఘము కూడ వ్యక్తి మనోవికాసమునకు అవ

కాశము లిచ్చు చుండును. వ్యక్తులలో మేధావంతులగు వారు దేశ కాలపరిస్థితుల నాలోచించి, సాంఘికనీతిలో క్రొత్తమార్పులను ప్రవేశ పెట్టగలుగుదురు. మొదట యీ మార్పులను కొంద రిచ్ఛగించరు. ఇట్టి మార్పులు, ఆధునిక యుగములో జరుగు చున్నవి. అమెరికాలో మద్యపాన నిషేధము, రష్యాలో సమిష్టి సాంఘిక రాజ్యపరిపాలనము, ఇంగ్లాండులో పారిశ్రామిక వాణిజ్య విప్లవము, ప్రపంచ మంతటకును ఆయుధ విసర్జనము, యజమానుల మీాద పాటకపు వర్గముల తిరుగుబాట్లు; యీ మొదలగు ననేక ఉద్యమములు బయలుదేరు చున్నవి. సర్వత్ర వ్యాపించనై యున్నవి.

న్యాయ మనునది మన సోదరుల బాధను జూచి కనికరించుట వలననే యేర్పడినది. మనము పొందుబాధలను యే విధముగా మనము పోగొట్టుకొన ప్రయత్నించెదమో మన సోదరులు కూడ అట్టి బాధల ననుభవించునపుడు వానిని పోగొట్టుటకుమనముప్రయత్నించుచుందుము.ఒండొరులశ్రేయస్సును గమనించుట సహజ ధర్మమగును. దీనికైనను స్వసంరక్షణాభిలాషయే మొదటి కారణము. ప్రథమములో నితర ప్రాణులను మోసము చేసి చంపినగాని, ఒక జీవము తన ప్రాణములను నిలుపుకొన నేరదు. స్వసంరక్షణకు మోసమే మొదటియుపాయము. సింహము, పులి మొదలగు క్రూర జంతువులు యితర మృగములను చంపి జీవించ వలెనన్న మోసముచేసి పొంచుండి హఠాత్తుగా వానిమీాద పడవలెను.

లేళ్లు, దుప్పులు మొదలగు బలహీనమైన జంతువులు, క్రూర మృగముల బారినుండి తప్పించుకొని జీవించ వలెనన్న మోసమునే ఆధారము చేసికొనవలెను. మనుష్యుడు కూడ మోసము చేసియే, చేపలు, పక్షులు, యితర జీవరాసులను పట్టుకొని తినును. కొంత కాలమైన తరువాత వానిలో కొన్నిటిని మచ్చికచేసి పెంచి తినుచున్నాడు. ఒక కాలమందు తన సోదర మానవులనే తినుచు వారిని బానిసలుగా చేసికొని వారిచేత సమస్తమైన యూడిగములు చేయించు కొనుచుండెను.

ఇప్పటికి కూడ, మన మతగురువులు, రాజులు, తాము దైవ స్వరూపులమని, దేవదూతలమని, దైవ సంభూతుల మని లోకులను వంచించి వారి మీద తమ యధికారమును చలాయించు చుండుట లేదా! ఈ విషయములో మట్టుకు తమకు యెంత మాత్రము నమ్మకములేక పోయినను మోస బుద్ధితో నిట్టి పన్నుగడలకు దిగుచుండిరి. వర్తకులు అనేక అబద్ధము లాడి తమ సరకులను యెక్కువ ధరలకు విక్రయింతురు. మధ్య దళారీ బేరగాండ్ర ద్వారా తమ కేమియు లాభము మిగులలేదని దైవము మీద ప్రమాణము చేసి ప్రజలను మోస పుచ్చి తమ వస్తువులను యేదియో యొక విధముగ విడుదల చేయ జూతురు. రాజ్య పరిపాలనలో రాజ్య తంత్రజ్ఞులు చేయు పనులన్నియు నిట్టివే. తుదకు తల్లి, తన పిల్లను, అన్నము తినునట్లు చేయుటకు అనేక అబద్ధములు

చెప్పి దానిని మోసముచేయును. న్యాయవాది, తనకు నిజము తెలిసి యున్నను, తన జీవనముకొరకు, నిజమును మరుగు పరచి అబద్ధమును పురికొల్పి న్యాయాధిపతి కంటిలో దుమ్ము గొట్టుటకు తన తెలివి తేటలను సదా వినియోగించుచుండును.

పూర్వము పశుబలమే న్యాయము. తన ప్రాణమును, సొత్తును యితరులు అపహరించకుండ నుండుటకును, యితరులది అపహరించుటకును తన శరీర బలమును, మనో బలమును ఆధారము చేసికొని, మనుష్యుడు దౌర్జన్యమును, మోసమును ఉపయోగించు చుండెను. తనకు శక్తి యుంటేనే గాని, ఆస్థి సంపాదించుకొనుటకు మార్గమే లేదు. ఈ శక్తి వలననే స్వామ్య మనేది చేకూరినది. మానవులలో, యీ అరాజకత్వముపోయి, ఒండొరుల యందు సానుభూతి వృద్ధియైన కొలది సదరు వ్యక్తియొక్క స్వామ్యమును, ప్రాణమును, సంరక్షించుటకు సంఘము ప్రయత్నించినది. అట్లు సంఘములు ప్రయత్నించని యెడల మానవులు ఒకరి నొకరిని చంపుకొని నశించి యుందురు, సంఘ మనునదియే యుండక పోవును. కాబట్టి వ్యక్తియొక్క స్వసంరక్షణకును, సంఘ రక్షణకును కూడ రాజులు, న్యాయ నిబంధనలు, న్యాయ స్థానములు, పంచాయతీలు మొదలగునవి క్రమేణా వెలసినవి. అవి వృద్ధినొందిన కొలది మానవుల కోరికలు కూడ మెండై వాని నుల్లంఘించుటకు అనేక మాయోపాయములు వారు పన్నుచుందురు.

వివిధ జాతులయొక్క స్వార్థపరత్వమే ప్రపంచము లోని యుద్ధము లన్నిటికిని ముఖ్యకారణము. కొద్ది సంవత్సరముల క్రిందట, అంతర్జాతీయ సమితి యొకటి యేర్పడి యీ యుద్ధములను నిర్మూలించుటకు ప్రయత్నించుచున్నది. ఒక జాతిని మరియొక జాతి అణగ ద్రొక్కకుండ చిన్న దేశముల ప్రతినిధులు, స్వసంరక్షణకు ఆ సమితిలో చేరి మిక్కిలి పాటు పడుచున్నారు గాని వీరి నైతిక బలముచేత పెద్ద రాష్ట్రములను నీతి మార్గమును ద్రొక్కనట్లు చేయబడునో లేదో సందేహమే. విశ్వమానవకోటి యంతయు ఐకమత్యముతో మెలగవలె నని యీ అంతర్జాతీయ సంఘమువారి యాదర్శము. మత విషయములలో వ్యక్తులకు మనస్స్వాతంత్ర్యము చేకూరినట్లే, సంఘములకు కూడ రాజకీయ సాంఘిక పారిశ్రామికాది విషయములలో సంపూర్ణాధికారము గలుగునట్లు యీ అంతర్జాతీయ సమితి చేయగలిగిన యెడల నైతిక రాజ్యము ప్రపంచమం దంతటను జయ ప్రదముగ స్థాపించినట్లగును. దీనికి మన విదేశీయ పరిపాలకులు తోడ్పడెదరా?

# 10 వ అ ధ్యా య ము

## నీ తి మ త ము ల స ం బ ం ధ ము

నీతి, మతముననునవి, ప్రత్యేకింపబడక, చాలా కాలము నుంచి కలసియే యుండి, సంఘములోని ఆచారములు, సాంప్రదాయములు, నమ్మకములు చేరి యిదియంతయు నీతియని యే వాడబడుచున్నది. ఈ నీతి మతములు విడిపోకుండుటచే తనే మతములేనిది నీతెట్లుండగలదని, ప్రపంచమంతటను జన సామాన్యమునకు గొప్పసందేహము కలుగుచున్నది. కాని యిదియంతయు పొరబాటు. వివిధమతాభిప్రాయములు, ఈ ప్రపంచములో అనేకమార్గములు పట్టుచున్నను, వీనియన్నిటిలో, నీతిధర్మములు చాలాభాగములు ఒకేవిధముగనున్నవి. దీనికి కారణమేమి ?

ఆస్తికుడును, అనుదినము, రెండుపూటలును దైవప్రార్థన చేయనిదే యే పనియు ఆరంభించనివాడు నగు మహాత్మాగాంధిగారు సహాయిట్లు వ్రాయుచున్నారు. "నిజమైన మతము నీతిలో యిమిడియున్నట్లు తేలుచున్నది. సత్యము కంటెను, న్యాయముకంటెను, ఉన్నతమైన మతములేదు. మతమనగా నీతిధర్మముల యెడల చూపుభక్తియని యర్థము. దైవముకలడని నమ్ముచు, అబద్ధములతోడను, అధర్మముల తోడను జీవితమును గడపుమనుజునికంటె, దైవనామము నెరుం

గకసత్యమును ధర్మమును కలిగి తనజీవితమును గడుపునట్టివాడే నిజమైన భక్తుడు, నీతివంతుడు. కేవలము వాగ్రూపకముగ సేవ నొనర్చువాడు, నాస్తికునికంటె నధముడు. కాని, రెండవవాడు ధర్మనిష్ఠాపరుడు. ఏలయన, అతడు దైవముయొక్క శాశ్వతనిర్వికల్పమైన యాజ్ఞలకు బద్ధుడైయున్నాడు." ఈవాక్యములతో నేనును యేకీభవించుచున్నాను గాని, నీతిమార్గము, దేవుడను నొకనియాజ్ఞలతో సంబంధించియున్నదని నేను విశ్వసించను. అటులనమ్మి, యీ మార్గమున నేను నడువను. ఈ నీతిమార్గమును, శాశ్వతముగా మన మనఃఫలకములమీద ఆయన యెన్నడు వ్రాయలేదనియు, బాహ్యప్రకృతి యంతయు యెట్లు పరిణామమును పొందినదో అట్లే నీతిమార్గకూడ, సమస్తమానవసంఘములలో, వాని సౌఖ్యమునకును, స్వసంరక్షణకొరకును, స్థిరత్వమునకును, పరిణామమును పొందుచుండెననియు, నమ్మవలెను. దీనిలో కొన్ని నీతిసూత్రములు సంఘములన్నిటి శ్రేయస్సునకు, ముఖ్యావసరములగుటచే, వానిని శాశ్వతములనియు, సత్యములనియు, న్యాయములనియు వాడబడుచుండును.

మనుష్యుడు, కొన్నిలక్షల సంవత్సరముల క్రిందటనే, ఆఫ్రికాఖండములోని చింపాంజి, గొరిల్లా కోతులనుండియు, ఆసియాఖండములోని గిబ్బన్, ఓరాంగొటాంగు కోతులనుండియు పరిణామమునొంది, క్రమక్రమముగా మనోవికాసమును వృద్ధిపొందించుకొనెను. మొట్టమొదట మనుష్యులు గొప్పసంఘ

ములుగా నేర్పడక, యెవరంతటవారే, యిష్టమువచ్చినట్లు తక్కిన జంతువులవలె తిరుగుచు, తరువాత స్వసంరక్షణము కొరకు సంఘములుగా కూడుచుండిరి. ఈ సంఘములు కట్టుదిట్టములో నుండుటకు, ఆయాకాలములను బట్టియు, దేశపరిస్థితులనుబట్టియు, కొన్ని కొన్ని నిబంధనలను చేసికొనబడుచుండెను. వానినే, మనవారు ధర్మములని వాడజొచ్చిరి. ఇవియు, స్థూలధర్మములుగాను, సూక్ష్మధర్మములుగాను, కాలక్రమమునమారుచూ, యిటులేర్పడినతరువాత గ్రంథములలో ఉల్లేఖించబడు చుండెను. శిష్టాచారములు, యే యే కాలములో నెట్లుండెనో, వానినే పరమధర్మములుగ యిటీవల స్మృతిపురాణేతిహాసములలో కూడ చేర్చిరి. కాబట్టి కొన్ని కార్యములు మానవసౌఖ్యమున కుపకరించును గనుక వానిని నీతికార్యములనియు, మరికొన్ని మానవులకు అపకారమొనర్చునుకనుక, అవినీతికార్యములనియు మనము వాడెదము. ఈ తప్పొప్పులు, దేవుడనువాడు, మనకు గ్రంథరూపేణాగాని, అకస్మాత్తుగా కొందరు మేధావంతుల మనస్సులకు తట్టునట్లుగగాని, యేర్పరచెననుట శుద్ధపొరబాటు. అవ్యక్తము. మానవుని యనుభవము, జ్ఞానములనుండియే యీ మంచిచెడ్డలనునవి బయలుదేరినవి. ఇవి వంశపారంపర్యముగ బలపడినవి. ఈ ధర్మముల నుల్లంఘించుటవలన, యేదియో నొక పరలోకములో శిక్షల ననుభవించవలసి వచ్చునని చెప్పు మతగ్రంథములను బొత్తిగా విశ్వసించకూడదు. ఆ శిక్షలు, యీ ప్రపం

చములో నే సంప్రాప్తమగును. ఏకార్యముయొక్క మంచిచెడ్డ లైనను, దైవముజారీచేయు ఆర్డర్లను బట్టిగాక, వానిఫలముల మీదనే యాధారపడును. సాంఘిక రాజకీయ శిక్షలకు వాని నతిక్రమించినవారు పాత్రులగుచుందురు. ఏకార్యముయొక్క నీతియవి నీతులైనను, సంఘసౌఖ్యమున కాకార్యములుఅనుకూలమైనవా కావా యనువిచారణనుబట్టినిర్ణయించబడుచుండును. ఆ మతగ్రంథకర్తయిట్లుచెప్పెను, యీమతగ్రంథకర్తయిట్లు చెప్పెను, అనుసంగతులు పాటించకూడదు. పెద్దమనుష్యులమని చెప్పుకొనువారు కూడ, అనేకవిధములైన పొరబాట్లకును, దురభిమానములకును లోబడుచుండుట మన మెరిగిన విషయమే. లార్డుబేకన్ అనే గొప్పమేధావంతుడగు న్యాయాధికారి, తాను చనిపోయేవరకు, మనభూమిచుట్టూసూర్యచంద్రనక్షత్రాదులు తిరుగుచున్నవనియే నమ్మినాడు. లార్డుహేల్ అను మరియొక న్యాయాధికారి, దయ్యాలపోతులని కొందరిని చిచ్చులోపడ వేయించెను. వెబుస్టరు అను అమెరికా రాజకీయవేత్త, నీగ్రోజాతివారి బానిసత్వమును సమర్థించెను. మనము గొప్పవారని యనుకొనువారి తెలివిహీనతలను గురించి అనేకపెద్దగ్రంథములను వ్రాయవచ్చును. మనకు హేతువాదము ప్రధానముగాని, చనిపోయిన పెద్దల పేళ్ళుకావు.

కాబట్టి నీతిసూత్రములు, మతములను వానిమీద నాధారపడవు. నీతిధర్మములను ప్రతిపాదించుటకు మత గ్రంథములు పుట్టినవని చెప్పనొప్పను. కాని, యీ ప్రతిపాదన

 

లతో ఆగక, వీనిని అనేకపిట్టకథలు, అర్థరహితమగు ననేక కర్మకలాపములతో నింపి, స్వర్గనరకములు, మొదలగు ననేక లోకముల నేర్పరచి, యీ వివిధమతములను నమ్మక తప్పదని యీ మతగ్రంథములు సర్వదా ఘోషించుచుండును. వీనిని నిలబెట్టుటకు కొందరు గురువులు, యోగులు, పురోహితులు యేర్పడుచుందురు. వీరు, మానవుల మూఢవిశ్వాసముల మీద నాధారపడి పొట్టపోసికొనుచుందురు. ఇక మనకు నాయకులమని చెప్పుకొనువారు, జనసామాన్యముయొక్క తెలివి తేటలనే తమయందు ప్రతిఫలింప జేసెకొనెదరు. విగ్రహారాధనమందు నమ్మకములేక, దేవాలయములకుపోయి, అక్కడిప్రతిమలకు దణ్ణముపెట్టువాడొకడు. మంత్రముల యందెట్టి నమ్మకములేక, వానియర్థము తెలియక, తద్దినములు మొదలగు కర్మలు చేయువాడొకడు, భౌతికశాస్త్రములలో కొంత ప్రవేశముండియు, మూఢాచారములకు దోసిలొగ్గి, పుష్కరస్నానములు, గ్రహణస్నానములు, నవగ్రహజపములు చేయువాడొకడు—యీ మొదలగు లోకవంచకులు, స్వవంచకులు, మనకు నాయకులగుట మనదురదృష్టము. సరియైన నాయకులు మనకు కావలెనన్న, ప్రజలలో మూఢభక్తి విశ్వాసములను పారద్రోలి వారిని ధైర్యవంతులుగాను, తెలివిగలవారుగను, నీతిప్రవర్తకులుగను చేయుగలవారుగ నారుండవలెను. ప్రజలలో సత్యజ్ఞానములు వ్యాపించనంతవరకు, అట్టి గొప్పనాయకులు మనకు దొరకజాలరు. వారు, రాజకీయవిషయములలో,

యెన్నికలలో పాల్గొని జయమొందజాలరు. సాంఘికవిషయములలో వారిమాట సాగదు. కాబట్టి, మనపాఠశాలలలో బాలురకు చిన్నతనము నుండి, మతసూత్రములను, పురాణగాథలను విడనాడుడనియు, నైతికసూత్రములకు, సహేతువులను కనిపెట్టుడనియు బోధించవలెను. బాలికలు, మున్ముందు తల్లులు కాబోవుచున్నారు గనుక, వారికికూడ యీ మూఢమతవిశ్వాసములను పారద్రోలవలెనని, సదా పాఠశాలలలో బోధించుచుండవలెను.

---

## 11 వ అధ్యాయము

### బ్రహ్మాండపురాణము

జనమంచి శేషాద్రిశర్మగారిచే సంస్కృతము నుండి యనువదింపబడిన యీ పురాణమును చదివితిని. ఇట్టి గ్రంథములు జనసామాన్యములో విషయగ్రహణమునకే ఉపకరించుట గ్రంథకర్తల యాశయ మైనయెడల వీనిని వచనకావ్యముగ విస్తరించి స్పష్టముగా తెలియునట్లు వీరు వ్రాయకపోవుట మిగుల శోచనీయము. అట్లు గద్యకావ్యము రచియించుటవలన వీరి పాండిత్యప్రకర్షణకు లోటు కలుగు

నేమో యను దురభిమానమే దీనికి కారణమని నాకు తోచు చున్నది. కాబట్టి కావ్యరచనశక్తి నటుండనిచ్చి దీనిలోని విషయములను నేను విమర్శింపదలచితిని. వీనిలో కొన్ని యథార్థములు కావనియు, ఊహాప్రపంచము మీద అల్లబడిన వనియు నాయభిప్రాయమును వెల్లడించినంత మాత్రమున మనపూర్వులు లోకవంచకులని నేనుతలంచుటలేదు. పాపము! వారికాకాలమునకు ప్రకృతిని గురించిన భౌతికజ్ఞానము కొంచవడినదనియు, ఈ విషయములో వారు పొందిన పొర బాట్లనుబట్టి వారికిని మనకును ఈ రోజువరకు తెలియని తెలియజాలని విషయములుకూడ ఊహాలమీద వ్రాసినా రనియు నాయభిప్రాయము. ప్రజాసామాన్యమునకు కొన్ని నీతిధర్మముల నుపదేశించుటకు, అనేక అభూతకల్పనలతో ఈ పుక్కిటిపురాణకథలను పసిపిల్లలకు బోధచేయునట్లు అల్లిరి. ఇట్టి పురాణములు చదువుట, వినుట పుణ్యమనియు, వీనిలోని విషయములు నమ్మవలసినదనియు, ఈ పురాణ శ్రవణము, పఠనము ముక్తిదాయక మనియు వ్రాసిరి. వీనిలో కొన్ని ధర్మములు, విలువైనవై ప్రజాసామాన్య మనుస రించదగినవే కాని, తక్కిన పిట్టకథలు, ఊహాలు, త్రోసివేయ దగినవేయని నాయభిప్రాయము. గనుక, అట్టి దృక్పథము తోనే యీ పురాణములను విమర్శింప దలచితిని. నాతో నేకీభవింపనివారు గ్రుడ్డిదర్బారుగా వానిని నమ్మవచ్చును గాని, వారు నేను వ్రాసినదానిని పునర్విమర్శన చేయదలచు

చో, హేతువులతో వ్యక్తిదూషణ చేయకుండ వ్రాయవలె నని ప్రార్థించెదను. ఋగ్వేదములోని నాసదీయసూక్తములో చెప్పినట్లు సృష్ట్యాదిని హిరణ్యగర్భు డనువాడొక డుండినను అతనికికూడ ఈ ప్రకృతియొక్క యుత్పత్తి తెలియునో తెలియదో! అట్టి విషయములో, యీ పురాణములోని సృష్ట్యుత్పత్తిని వ్రాసి తరువాత సృష్టిక్రమవికాసము ఎట్లు వర్ణింపబడెనో దిజ్మాత్రముగ చూపించి, దానిమీద విమర్శన చేసెదను.

దీనిలో సృష్ట్యుత్పత్తిని గురించి వ్రాసిన విషయములు నేనెన్ని సారులు చదివినను నాకు బాగుగా స్పష్టపడలేదు. మొట్టమొదట పరమేష్టికి లోకములను సృష్టించవలెనని యిచ్ఛగలిగినదట. ఇది ఎందుండివచ్చెనో యీ గ్రంథకర్త యగు వ్యాసులవారు చెప్పజాలక పోయిరి. స్వయంభువు అన్నంతమాత్రమున, అది ఋజువు కానేరదు. నమ్మకము యింగితజ్ఞానులకు కలుగజేయజాలదు. పరమేష్ఠి, సత్రాధ్వరము చేసి తనముఖమునుండి దేవతలను సృజించెనట! వారు వేయి సంవత్సరము లయినతరువాత, నైమిశారణ్యమందు, గోమతినది ఒడ్డునపడిరట! సృష్టిచేయదలంచి, ప్రకృతిప్రధానం బగు అవరతత్వము, ఆదిమధ్యాంతములు లేని గుణత్రయమైన భావము నొందిన నూతన మహాండ మందు జనించెనట! ఏడు లోకములు, భూమిలోని యేడుద్వీపములు, యేడు సముద్రములు, పర్వతములు, నదులు ఆయాండమందే నుండెనట!

దానిలోనే సూర్యచంద్రనక్షత్రములు, గాలి, తేజస్సు, ఆకాశము మొదలగునవి యుండెనట! ఆపరమేష్టియే, సత్వ గుణముచేత హరియనియు, సగుణముచేత శివుడనియు, రాజ గుణముచేత బ్రహ్మయనియు చెప్పనొప్పును. వీరుముగ్గురును సమన్వయులు, అనువ్రతులు, ప్రేరకులు నగుచుందురు. వీరిలో వీరికి భేదమేమియు లేదు. వీరు ముగ్గురు, విరాట్పురుషుని యందధిష్ఠితులు. దేవతాధిపుడైన ఆ పావనాత్ము మోలిల ఒక్కపురుషుడు, హిరణ్యగర్భుడనువాడు, పుట్టెనట! కావున పురుషులలో ఆతడే ఆద్యుడట! ఆతడే ప్రతి కల్పాంతమందును నూతన సృష్టి చేయుచుండునట! అతను తనతో సమానులగు ముగ్గురు మానసతనయులను సృజించగా వారు సృష్టించుట మానుకొనుటచే కొంతమంది పితృదేవతలను, నవబ్రహ్మలను ప్రతిసర్గమునుచేయ సృజించెనట! వీరును బ్రహ్మమానస పుత్రులే కాని బ్రహ్మయే వీరిగుండా సురలను, సురవైరులను, భూతములను, చరాచరములను, యక్ష పిశాచములను, అప్సర కిన్నెరాదులను, ధర్మాధర్మములను మనుష్యులను వారి వర్ణములను సృజించెనట! కల్పాంతమందు ప్రళయమువచ్చి, యివి యన్నియు నశించినను, తిరిగి వీనిలో కొన్ని మిగిలి పుట్టుచుండునట! పరాత్పరుడు లోకవ్యవస్థను చేయదలచి "సత్వోద్రేకంబున మాన్యంబగు లోకంబు కనుంగొని పునస్సృష్టి కాముం డ"గునట!

స్థావరజంగమాత్మతమగు సృష్టి నశింపగా, వేయి

చతుర్యుగములైన తరువాత బ్రహ్మయే నారాయణు డను పేరుమీద సముద్రములో నిద్రించునట! ఆకాలములో భృగ్వాదిమునులు, సత్యాదులైనమంద్రుసు, మహర్లోక దాసులుగ నుందురట!

ఈ మహర్లోక మెక్కడనుండి వచ్చినదో? బ్రహ్మగారు ఆకాలములో నిద్రించుచున్న లోకములను గాంచి సంతో షించుచుందురట! కల్పాదియందు, 14 మనువులు మొదలగు వారిని సృజించి కల్పాంతమందు జగములన్నిటిని ఉపసంహ రించునట! నీళ్ళలోనుండి భూమిని ఉద్ధరించి, సప్తద్వీపము లుగవిభాగించి, ప్రతిదానికి యేడేసివర్గంబు లేర్పరచి, పర్వత ములు పూరించి యీ రెంటిని సమానసంఖ్యలుగా వెలయింప జేయునట! ఇట్టివేఎత్తి అసంబద్ధములగువానిగ్గురుచ్చి, సృష్ట్యు త్పత్తినిగురించి వ్రాయబడియున్నది. దాని నంతయు నింకను విపులముగ వ్రాసిన, చదువరులకు విసుగుజనించునని భయ పడి విరమించితిని. ఈ పిట్టకథలను నమ్మటకు ఎట్టియాధార ములు లేవనియు, ఇవి మనపూర్వఋషుల కేవల ఊహాజనక ములనియు ముందుదీనిలోవ్రాయబడిన సృష్టిక్రమము ఆధునిక భౌతికశాస్త్రపరిశోధనకు వ్యతిరేకముగా నుండుట బట్టియే యీ సృష్ట్యుత్పత్తిని గురించికూడ, వారికి దాని నిజస్వరూ పము తెలియుదనియు, నేను ఋజువుచేయ బ్రయత్నింతును.

మొదట పుట్టిన చెట్లు తీగెలు మొదలగునవి మనుజులు బలాత్కారముగ త్రెంపుటవలన నశింపగా, పైన

వ్రాయబడిన ప్రకారము బ్రహ్మగారు తిరిగి బీజములను సృజించి, మనుష్యులకు హస్తసిద్ధి నొసంగుటవలన, వానిని భూమిమీద చల్లగానే, వారికి కావలసిన సస్యపదార్థములు దొరకినవట! వీనిని జాగ్రతగ రక్షించుటకు బలవంతులగు రాజులను సృష్టించెనట! ఇట్లె భూమిని సేద్యముచేసి ధనము గణించుటకు వైశ్యులను, వీరందరికిని సేవచేయుటకు శూద్రులను యేర్పరచి వారివారికావృత్తులను కల్పించెనట! కాని, ప్రజలు యీధర్మములను సరిగా ఆచరించకపోవుటవలన, అవి నశించినవట! నాలుగువర్ణములకు వరుసగా, యాజనాధ్యాపన ప్రతిగ్రహములు, దుష్టశిక్షణ శిష్టరక్షణ సైన్యసంపాదనములు, గోరక్షణవాణిజ్యములు, సేవశిల్పాజీవనము, న్యాయమైన వృత్తులుగచేసి, వీరికి ప్రత్యేకముగా ఊర్ధ్వలోకములను కల్పించినను, మనుజావళి వృద్ధికి రాలేదని బ్రహ్మ మిక్కిలి విచారించి, యీమానవసృష్టిని తానుచేయుక మరియొకరు చేసిన నది వర్ధిల్లునేమోయని తలచి తనశరీరములో నుండి తనతో సమానమైన అమరులను, పితరులను, మానులను మనువులను, ధర్మబోధనకు బ్రహ్మతిరిగి సృజించెనట! వీరట్లు నిఖిలధర్మములను తెలుపగా జనులు వర్ధిల్లిరట! యుగసమ ధర్మములు లెస్సగా నడచెనట! శాస్త్రధర్మముల నాచరించుచు సత్యమేపల్కుచు భక్తితోనందరు సంచరించిరట! ఇట్లు ప్రతి కల్పాంతమున వీరందరు పూర్ణముగ నశించి మరల నీసృష్టియందు పూర్వతను తుల్యంబులగు కళేబరంబులదాల్చి

దేవాదులుగ పోల్చిరట.

ఇట్టిగాథలు నేనింకను వ్రాయుచు చదువరులను విసికింతుననే భయముతో స్థాలీపులాక న్యాయముగ, ఈగ్రంథములో చెప్పిన సృష్టిక్రమమునుగురించివ్రాసితిని. ఇట్లు బ్రహ్మతాను మాటిమాటికి చేయి జేసికొని తన సృష్టిని సవరించుకొనవలసిన యావశ్యకత అతని సర్వజ్ఞతకు మిక్కిలి లోపము. ఇదియంతయు సత్యమని నమ్మువారు.ఆధునికపరిణామ శాస్త్రజ్ఞానమంతయు త్రోసివేయవలసియుండును. బైబిలులోవ్రాయబడిన ప్రపంచసృష్టి వృత్తాంతము యెట్లుమనము నమ్మజాలమో యిదియు నట్లే నమ్మకూడదు. ఆయామతగ్రంథకర్తలు తెలిసినది కొంత, తెలియనిది కొంత గుచ్చెత్తి తమ యూహా ప్రపంచములోనుండి అనేక పిచ్చిపిచ్చి కథలనల్లిరిగాని మనకు తెలిసినంతమట్టుకైనను ప్రకృతి రహస్యములను గురించి పూర్వమత గ్రంథకారు లెరుగరు.

ఇక వీరి భూగోళశాస్త్రజ్ఞానము నాలోచింతము. ఈగ్రంథము వ్రాయబడిన కాలములో ఆయా దేశవిభాగములు, పర్వతములు నదులు మొదలగు వానిపేర్లు వేరుగానుండ వచ్చును. వానిలో ననేకమైన వానికి, యిప్పటి స్థలనిర్దేశ్యము చేయలేక పోవచ్చును. వానిలో కొన్ని నశించి కొన్ని పెరుగ వచ్చును, మారవచ్చును. వానివైశాల్యములు, వర్ణనలు, నిజమనియే ఒప్పుకొందము. వీని నన్నిటిని చదివిన మనకు లాభములేదు. చదువకున్న నష్టములేదు. మనము ప్రదేశ

నిర్ణయమును కలిగినవానిలోనే యీ గ్రంథములో పొర బాట్లు కనిపించినవి. ఆంధ్రపాండ్యచోళ దేశములు భారతవర్ష ములో పశ్చిమదిక్కున నున్నవట! (127 వ పేజి) గంగ మూడు ముఖ్యపాయలై, దానిలో సింధునది యనునది. కురుపాంచాల సింధుదేశములగుండానే కాక, కాశీ మగధ వంగ దేశములలో కూడ పారుచుండెనట! భాగీరథియను మరి యొకపాయ, వింధ్యపర్వతము అడ్డుతగులుటవలన ఓరగాపోయి సముద్రములో పడినదట! (133వ పేజి) ఇట్లు సప్తద్వీపములను వితల మొదలగు లోకములను, అభూతకల్పనలతో వర్ణించ బడినవి. ఇట్టి వర్ణనలలో కొంచెమైనను ఇప్పుడు మనకు కన బడు ప్రపంచములో యేభాగమునకును, కొంచెమించుగా నైనను వర్తించదు. ఏడులోకములు ఒకదానిపైన ఒకటి గొడుగులవలె ఆచ్ఛాదితమై యున్నవట! (164 వ పేజి)

ఇక ఖగోళశాస్త్రజ్ఞానమును గురించి చెప్పనేల? భూగోళశాస్త్రముకంటె విపరీతముగ వర్ణించబడినది. గ్రంథ కర్త తన గుఱ్ఱముయొక్క కళ్లెమును జారవిడచి విచ్చలవిడిగ అతిశీఘ్రముగ సవారిచేసెను. భూమియే ప్రధానమనియు, యిచ్చటి ప్రజలకొరకే యీ బ్రహ్మాండమంతయు సృజింప బడెననియు, సూర్యచంద్ర గ్రహతారకావళి యంతయు యీ భూమి చుట్టు తిరుగుచున్నదనియు యీ గ్రంథకర్తయొక్క అభిప్రాయ మైనట్లు నాకు గోచరించినది. ఈయన యభి ప్రాయము శుద్ధ పొరబాటు. గ్రహములనునవి, సూర్యుని

చుట్టు తిరుగుచుండునదియు, చంద్రుడు, భూమివలెనే తన చుట్టు తాను చుట్టుకొనుచూ, భూమి చుట్టు, తిరుగుచుండు ననియు, సూర్యుడు తిరుగడనియు, ప్రతి విద్యార్థికి తెలుసును. సూర్యుడు తూర్పునుండి పడమరకు పోవుటయే గాక త్రోవలో దక్షిణమునకేసి శీఘ్రముగాను ఉత్తరమునకేసి నెమ్మదిగాను, పోవుచుండునట! ఈ కారణముచేతనే, మనకు దక్షిణాయన ములో రాత్రులకంటె పగళ్లు కురచయగుటయు, ఉత్తరాయ ణములో అవి దీర్ఘములగుటయు సంభవించునట! ఇది గొప్ప పొరబాటు. ఏమన, భూమి సూర్యుని చుట్టు పడమటినుండి తూర్పుకు కేవలము వలయాకారమగు కక్ష్యములోగాక, కోలగా నుండు కక్ష్యలో తిరుగుటచేత, కొన్ని మాసములలో సూర్యునికి సమీపముగను, కొన్ని మాసములలో సూర్యునికి దూరముగా నుండును. దూరముగా నున్నపుడు, ఒండొంటి ఆకర్షణశక్తి తగ్గియుండుటచే, భూమి మెల్లగా తిరిగి, సూర్యున కెక్కువకాల మభిముఖముగ నుండుటచే, ఆమాస ములలో పగళ్లు దీర్ఘములుగ నుండును. తక్కిన మాసములలో సూర్యునికి సమీపముగ నున్నపుడు, త్వరగా భూమి పోవు చుండుటవలన, పగళ్లు కొంచెము కురుచగా నుండును. సూర్యునిచుట్టూ భూమికున్న కక్ష్యలోని స్థానమును బట్టియే ఉత్తరాయణ దక్షిణాయనములు, ఋతువులు రాత్రింబవళ్ళు బయలువెడలినవి. ఇక గ్రహణములను గురించి వ్రాసిన యద్భూత కల్పనలగురించి చెప్పవలసినదేమి? ఈ రోజువరకు,

మన యాంగ్లేయవిద్యాధికులు కూడ తమ సోదరులకు మార్గదర్శకు లగుటకు బదులుగా, ప్రజాసామాన్యముతో ఒకతప్పు త్రోవను త్రోయబడుచు, రాహుకేతువులచేత సూర్యచంద్రులు మ్రింగబడి, తమకు మైలకలిగినదని, గ్రహణముల పట్టువిడుపుకాలములలో, సిగ్గులేక స్నానములు చేయుట, భోజనములు మానుట నవలంబించుచున్నారు. ఇట్టి మూఢ విశ్వాసములకు వీ రే దా సు లై నిజమైన హైందవజ్ఞాన విజ్ఞానములను యీ ప్రపంచములో నశింపజేయుటకును, సంఘాభివృద్ధికి భంగపాటు కలిగించుటకును కా ర ణ భూతులగుచున్నారు. తమవిమర్శజ్ఞానమునుపయోగించకుండ, మందికి లొంగిపోవుచుండుట వీరి మనోబానిసత్వము వేయినోళ్ల చాటుచుండును.

మందేహాసురులు మూడుకోట్లు ప్రతిదినమును, సంధ్యవేళలను సూర్యుని పట్టుకొని బాధించెదరట! అతని రక్షణకొరకు ఆదిత్యులు, బ్రాహ్మణులు మొదలగువారు బ్రహ్మను వేడుకొని "ఓంకరగణ బ్రహ్మసమన్వితంబుగ తమిన్ గాయత్రి మంత్రించి, పుష్కరమున్ దోసిటబట్టి సూర్యహిత మాగాంచు వేచల్లినన్," ఆ తపోబలంబున ఆరాక్షసులు పారిపోయిమరల మరునాడు వచ్చుచునే యుందురట! ధ్రువనక్షత్రశక్తిచేతనే సూర్యుడు భూమిమీదనుండి జలములను గ్రహించి వర్షరూపమున మనకు వానిని తిరిగి యిచ్చుచున్నాడట! తుంటికొడితే పల్లువిరిగిన చందముగా నున్నది! ధ్రువుడే సూర్యుని నడపు

చున్నాడట! ధ్రువనక్షత్ర మెక్కడ. సూర్యు డెక్కడ! ధ్రువుడే తాను తిరుగుచు సూర్యునికూడ నడపుచున్నాడట! గ్రహనక్షత్రకాదులను కూడ త్రిప్పుచుండునట! ఆ ధ్రువుని చేతనే యివి యన్నియు కట్టుబడియుండునట! నిజముగా సూర్యునికంటె అనేకరెట్లు పెద్దవియై, దానికంటె తేజోవంతములై సూర్యమండలమునకువలెనే వానిలో నొక్కొకదాని చుట్టు నవగ్రహములవంటి వనేకము లుండవచ్చును. మనకు ఒక్క చంద్రుడే యున్నాడు గాని, మనతోడి గ్రహములకే యిట్టి చంద్రులు యిద్దరు ముగ్గు రున్నారు. ఒకడే చంద్రుడనియు, ఒకటే చంద్రలోకమనియు ఖగోళశాస్త్రజ్ఞానము కొరవడిన మనపూర్వులు వ్రాసిన విషయము సత్యమునకు దూరమని మనము నమ్మవలెను. అనేక సూర్యమండలములతో నిండిన యీ బ్రహ్మాండ మంతయు, దానిలో ఒక చిన్న అణువగు యీ భూఖండములోని యీ స్వల్ప మానవకీటకముల కేర్పడినదని యనుకొనుట మిక్కిలిహాస్యాస్పదమైనవిషయము. కాబట్టి యీగ్రంథములో వ్రాసినగాథలన్నియుసూర్యరథవర్ణనము, ధ్రువచర్యాకీర్తనము, జ్యోతిస్సనివేశము మొదలగు అభూతకల్పనలతో నుండియున్నాడు. గాథలన్నియు, సూర్య చంద్రగ్రహనక్షత్రాదు లన్నియు దేవతలుగా భావించుట అభూతకల్పనలని గట్టిగ విశ్వసించుడు! సూర్యమండలము సమస్తనక్షత్రములకు జనకమని వ్రాయుటబట్టియే ఈ యప్రమాణగ్రంథమును చదువుట నిరుపయోగము. ముక్తిదాయ

కము కాదుగదా, ప్రయోజనరహితము. నక్షత్రములకుకూడ సూర్యుడు కాంతిని కలుగజేయునట! నక్షత్రములపైననే బృహస్పతి మొదలగు గ్రహరాజము లున్నవట! వీనిక్రింద సూర్యుడు, చంద్రుడు, భార్గవుడు ఉన్నారట! బుధుడు నక్షత్రములకంటె పై నున్నాడట! ఇతనికంటె పైన భూమిజుడు, యితనిపైన బృహస్పతి, ఇతనికంటె పైన అర్కసూనుడు ఉన్నారట! ఈ వర్ణన మంతయు ఖగోళశాస్త్రమునకు వ్యతిరేకము.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లొక్కరేయనియు ముగ్గురును సమానశక్తి గలిగి వేరువేరువనులు చేయుచుండురనియు యీగ్రంథములో పలుచోట్ల బోధింపబడుచున్నను, శివుడు లింగముగా అవతరించినపుడు బ్రహ్మ విష్ణువులు వేయి సంవత్సరములు దాని తుదిమొదళ్లను తెలిసికొనుటకు పోయి తుదకు తెలిసికొనజాలక వేసారి యెప్పటిచోటికి వచ్చి శివుని ప్రార్థించవలసి వచ్చినదట! ఇట్లే ఒకరినొకరిని తెలిసికొనజాలక మాయలో పడుచుండినట్లు యీపురాణములో కనుపడుచున్నది. దీనిని సమర్థించుటెట్లు? నాకెంతమాత్రము బోధపడలేదు. యుగధర్మములను వివరించుటలో యీప్రపంచములోని మానవులు క్రమక్రమముగా అన్నివిధములను చెడిపోయి జరిగిపోయిన యుగములే ఒకదానికంటె ఒకటి మంచివని గ్రంథకర్త వర్ణించెను. ఇదియంతయు ప్రకృతి పరిణామమునకు విరుద్ధము. మనపూర్వచరిత్రలను ప్రత్యక్ష ప్రమాణ

ముగ తీసికొన్నయెడల మానవుడు మొత్తముమీద అనేక
విషయిక జ్ఞానములో యెక్కుడభివృద్ధి నొందెనుగాని వెనుక
బడలేదు. దుర్మార్గముకూడ నూతనమార్గముల పెచ్చుపెరిగి
యుండవచ్చును. కాని సన్మార్గముకూడ దానితో పెరిగి
దానిని అనేకవిధములుగ అడ్డుపెట్టుటకు వివిధమార్గముల
నన్వేషించుచునే యున్నది. పూర్వపు మతకట్టుబాటులు నడ
లుటమాత్రము నిశ్చయముగ సంభవించుచున్నది. భౌతిక
శాస్త్రములన్నిటిలో, మన తాతలజ్ఞానముతో నెట్లు మనము
తృప్తినొందజాలమో ఆలాగు ననే వారి మతసాంప్రదాయ
ములతో మనమెట్లు యేల తృప్తినొందుదుము? వీనిలో
మాత్రము వికాసము బయలుదేరకుండునా? కాబట్టి ప్రపం
చము చెడిపోవుచున్నదని యీ మతాచార్యుల యూహకెట్టి
విలువ నీయనక్కరలేదు. వీరికి ఎంత పూర్వపు మతసాంప్రదా
యమైతే ప్రాతచింతకాయ పచ్చడివలె అంత ఉత్కృష్టమైనది
నవీనమైన దేదియు వీరికి రుచించదు. భవిష్యత్కాలములో
యింకను ఈ ప్రపంచస్థితి మరియు అధ్వాన్నమగునట! పూ
ర్వమొక కాలమందు తిండి, బట్ట, గృహములేక ఒకరినొకరు
పీకుకొని తినుచు తిరుగుచుండు అడవిజాతులనుండియే ప్రకృతి
లోని యనేక రహస్యములను గ్రహించి, సారస్వత శాస్త్ర
కళాభివృద్ధిని పెంపుచేసికొన్న యాధునిక మానవుడు బయలు
దేరెనని, మన మతగురువులు, ఈపురాణ గ్రంథకర్తలు
నమ్మరు. వీరు పరిణామశాస్త్రము బొత్తిగా యెరుగరు.

ప్రకృతిపరిణామములో నెల్లప్పుడు నూతన సమస్యలు అన్ని యుద్యమములలోను బయలుదేరుచునే యుండుననియు, వానిని పరిష్కరించుటకు మానవుడు సదా ప్రయత్నము చేయవలసి యుండుననియు, వీరికి తోచదు. వీరు పూర్వపు స్మశానవాటికలలో నుంటూ, అభూత కల్పనలతో నిండిన మతములతో ప్రొద్దుపుచ్చు కొనవలసినవారే. ఈపురాణములలో, ప్రతికథకు చివరను దీనిని చదివినవారును విన్నవారును సకలైశ్వర్యవంతులై యిహలోకములో నుంటూ జీవితాంతమున పరలోకములో పుణ్యమూర్తులై యుందురని వ్రాయబడుచుండును.

వేమడనురాజు దుర్మార్గు డగుటచేత మునులు, అతనిని చంపి, అతని దక్షుహస్తమును మధింప పృథుచక్రవర్తి పుట్టెనట! ఈ చక్రవర్తికి భయపడి భూదేవి పారిపోవుచుండగా దానిని పట్టుకొని దానిప్రార్థన నంగీకరించి, దానిని గోవుగా చేసి సస్యపయస్సును పిండి దానిమూలమున యీ చరాచరసృష్టిని సిలిపినాడట! కాబట్టి అంతకు పూర్వములేని సస్యజాలములు, ధేనరక్షణ, కృషికర్మను, వణిక్పథము, వైవస్వతమన్వంతరమున వెలసినవట! చంద్రుడు ఆ యావుకు దూడయైనాడట! అప్పుడు విప్రజ లాగోవుపాలను త్రాగి సుఖించిరట! ఇట్లే యింద్రుని దూడగచేసి యముడు పితికెనట! తక్షకుని దూడగచేసి వాసుకి పితికెనట! ఇట్టి పిచ్చికథలను వ్రాయుటకు నాకే సిగ్గగుచున్నది.

బ్రహ్మ పూర్వమన్వంతరములయం దుండిన సప్తర్షు లనే వైవస్వతమన్వంతరంబునకూడ పుట్టించెనట! పూర్వము శంకరుడు వీరిని శపించుటచేత వీరు భూమిమీద తిరిగి పుట్ట వలసివచ్చెనట! అప్పుడు బ్రహ్మ తానొకయజ్ఞముచేసి దానిని చూచుటకు అమరాంగనలు మొదలగువారు రాగా వారిని చూడగానే అతనిశుక్రము జారెనట! దానిని మంత్రములతో అగ్నిహోత్రములో వేల్చగా మొట్టమొదట భృగువుపుట్టె నట! శివుడు తనకు పిల్లలు లేరని ప్రాధేయపడగా బ్రహ్మ గారు అతనిని ఆయనకు దత్తుగా యిచ్చివేసెనట! ఆంగీరసుడు పుట్టగా అగ్నిదేవుడు ప్రార్థించి అతనిని తన పుత్రునిగా యేర్పరుచుకొన్నాడట! ఈ విధముగానే తక్కిన బ్రహ్మలుద యించిరట! ఈ బ్రహ్మలవలన పితరులు, దేవగణములు, వాలఖిల్యులు, అశ్వినీదేవతలు మొదలగువారు పుట్టిరట! కొందరు రాజులు, పైవారి చెవులనుండియు, వెంట్రుకల కుదు ళ్లనుండియు, స్వేదములములనుండియు పుట్టిరట! అయినములు ఋతువులు, పక్షములు, అహోరాత్రములు, పిత్తము, జ్యోతి స్సు మొదలగునవి ఉదయించెనట! ఈ సృష్టికథలకు ఆద్యం తములే లేవు. వీనిని చదివినయెడల "ఆయుష్మంతులును పుణ్యశీలురును, శాశ్వతసుఖవంతులును" అగుదురో కారో గాని, యిప్పుడు పిచ్చివారై పోవుట కెట్టిసందేహమును లేదు.

ఈ గ్రంథములో పితృపూజను గురించియు, పరశురా మావతారకథను గురించియు, అనేకచిత్రవిచిత్రములుగ వ్రాయ

బడియున్నది. పరశురామునికి, చాలాకాలము తరువాత అవ తరించిన కృష్ణుడు, శివుని ఆజ్ఞచేత, పరశురాముని కగుపడెను. దేవుని యవతారమే యని యెంచబడు పరశురాము డప్పుడు శివుని, కృష్ణుని ప్రార్థించెనట! కృష్ణుడు, తాను ముందు శ్రీ రామావతార మెత్తి యవతరించువరకు తనయంశసంకలితు డవై యొప్పుచుండుమని, పరశురాముని దీవించెనట! రాధయు కృష్ణుడును పరశురాముడు గణేశుని దంతభగ్నము చేసినాడని అతని తల్లియగు పార్వతి దుఃఖించుచుండగా ఆమెను ఊర డించిరట! అట్లు వా రుభయుల బోధనలకూరడిల్లి ఆమె పరశురాముని కౌగలించుకొని, అతనికనేకవరముల నొసగె నట! రాధ గణేశుని కౌగలించుకొని అతని బాధ మాన్పెనట!

ఇంక నొక్కకథను వ్రాసి, యీ గ్రంథవిమర్శనను ముగించుచున్నాను. బృహస్పతి, జ్ఞానియైన ఒక గొప్పఋషి యైనను, గర్భిణిగా నున్న తన యన్నభార్యను, ఆమెకూడ దని యెంత పలదన్నను, బలాత్కారముగ తన శుక్రమును ఆమె గర్భములో ప్రవేశపెట్టి, అదివరకు కడుపులోనున్న శిశు వు దానిని వారించ ప్రయత్నించినందుకు ఆ శిశువును కూడ తమోదీర్ఘమగుమని శపించినాడట. తనకు పుట్టినపుత్రుడు బృహత్కీర్తియను వానితో కలసి, తన యన్న దగ్గరనే తాను కూడనుండెనట! ఇట్లుండగా, వారందరు పెంచుచున్న సౌర భేయమను వృషభము, అమావాస్యాప్రయుక్త కర్మంబుకొఱకు పరచియుంచిన దర్భలయందు తిరుగుచుండగా దీర్ఘతముడు

దానికొమ్ములను పట్టుకొని వదలకుండెను. ఆవృషభము తాను చేసినది తప్పు కాదనియు, తన జాతిస్వభావమే యనియు, యితరుల యాస్తిని తాను అనుభవించినను దానివలన తన కెట్టి పాతకము లేదనియు చెప్పగా దానినివిడచి ఆ గోధర్మంబునే తాను అవలంబించి తన సోదరుని భార్యను సంభోగమునకు రమ్మని బలవంత పెట్టెనట! అప్పుడామె యామాట్లు విని, శరద్వంతుడను ఋషి ఆ దీర్ఘతముని వృద్ధుడవై గ్రుడ్డివాడవగుమని శపించి, గంగలో త్రోసివేసెనట! అచ్చటనాచుతో కొట్టుకొని పోవుచు, బ్రహ్మమును ప్రార్థించుచుండగా బలిచక్రవర్తి అతనిని రక్షించి తనభార్యను అతనికి ఒప్పచెప్పి కొడుకులను సంపాదించుకొన్నాడట! తరువాత వెనుక చెప్పబడిన సౌరభేయుమను వృషభము, పూనికతో తనగోధర్మమార్గమునే యతనవలంబించినాడు గనుక, అతనికి బృహస్పతి యిచ్చిన శాపమునుండి విమోచనము చేసి యౌవనమును, దృష్టిని, అతనికి తిరిగివచ్చునట్లు చేసినదట!

ఇట్టి కథలతో నిండిన ఈ బ్రహ్మాండ పురాణములో, మనుష్యులు ఒండొరుల యెడల, యెట్టిధర్మముల నాచరించవలెనో, మానవశ్రేయమునకు యెట్లు నడచుకొనవలెనో, ఒక్కముక్కయైనను నాకగుపడలేదు, సరికదా, తిరిగి రామాయణ భారతకథలు తారాశశాంక విజయమువంటి రంకుపురాణములు, ఋషుల, రాజుల వంశములు మొదలగునవి మాత్రమే కనుపడును. సృష్ట్యుత్పత్తిగాథలు వానినాశనములగురించి, అ

భూతకల్పనలను, ఊహాప్రపంచము మీదనే ఆధారపరచి, సృష్టించబడినవి. జ్ఞానాభివృద్ధికి ఈ గ్రంథ మెంతమాత్రము ఉపయోగకారికాదు. దీనిని చదువుటవలన పుణ్యములేదు. పురుషార్థములేదు. ఇహపరముల కెంతమాత్రము ఉపయోగపడదు సరికదా, పసిపిల్లలకుకూడా దీనిలోని పిట్టకథలను చెప్పుట మహాపాపమని నా యభిప్రాయము.

---

## 12 వ అ ధ్యా య ము

## వి ష్ణు పు రా ణ ము

ఈ గ్రంథములోని చాలా భాగము, బ్రహ్మాండపురాణములలోనుండి యెత్తి వ్రాయబడినట్లు కనబడుచున్నది. దీనిలో కూడ సృష్టిక్రమము వర్ణింపబడినది. ఈ రోజువరకు ప్రకృతిశాస్త్రజ్ఞులుగాని వేదాంతశాస్త్రజ్ఞులుగాని యీప్రకృతి యేల యెట్లు పుట్టునో దీనిని కల్పించినవాడున్న యెడల తానెట్లు పుట్టెనో యే యుద్దేశ్యముతో దీనిని సృజించెనో చెప్పజాలకున్నారు. కాబట్టి మన పురాణకర్తల యూహాజన్యములను కొంత విచారింతము.

వాసుదేవు డనువాడు జగము లన్నియు తనలోనను తాను జగములలోనను వసియించియున్నాడట! తనకుతానే శూన్యమునుండి పుట్టినాడట! "కాలరూపవృత్తినిసర్గకాల వేళ" తాను సంక్షోభించుటచేత, శబ్దము బయలుదేరినదట! ఆ శబ్దమువలన ఆకాశతత్వము పుట్టినది. ఆ యాకాశమునకు శబ్దము గుణమైనది. ఆ శబ్దమునకు స్పర్శంబు తన్మాత్రగుణ మైనది. ఆ స్పర్శమువలన వాయుతత్వము పుట్టినది. వాయు తత్వమునకు రూపము తన్మాత్రిగుణమైనది. ఆ రూపము వలన అగ్ని పుట్టినది. ఆ యగ్నికి రసము తన్మాత్రిగుణ మైనది. ఆ రసగుణమువలన ఉదకము పుట్టినది. ఆ యుదక మునకు గంధంబు తన్మాత్రిగుణమైనది. ఆ గ్రంథమునకు భూమితత్వము పుట్టినది. ఆ భూమికి శబ్దాదులైనను తన్మా త్రగుణములైనవి. ఈ పంచభూతములును తమలోపలి శబ్దాదిగుణములు ప్రవర్తింపగా వ్యాపించి విశ్వమయమైనవి. ఈ భూతపంచకంబులును గుణపంచకంబును, వాక్పాణి పాదపాయూపస్థలకర్మేంద్రియ పంచకంబును, త్వక్చక్షుశ్శ్రో త్రజిహ్వాఘ్రాణంబులను బుద్ధీంద్రియ పంచకంబును, మనోబుద్ధ్య హంకారముల రాజస, తామస, సాత్వికగుణయుక్తంబుగ ప్రజా సృష్టి వర్ధిల్లజేసెనట! ఇదియంతయు, వాసుదేవుని చేత వినోదప్రాయమున విస్తరిల్లినదట! మనకు సంభవించు భూకంపములు యుద్ధములు తుపానులు జలప్రళయములు అగ్నిపర్వతపు పేలిల్పులు, క్రూరకృత్యములు, జాడ్యములు

చావులు మొదలగునవన్నియు ఆ పరమదయాళుడును సర్వ శక్తిమయుడగు ఆయాదిదేవుని వినోదములట!

ఆయన సముద్రములో ఒక పాముమీద పడుకొని యీ సృష్టి క్రియనంతను రజోవృత్తిచేత తన మనస్సులో నిర్ణయించుకొన్నాడట! అప్పుడు సముద్రములో ఒక అండము పుట్టినదట! దాని వెలుపల చీకటి నడుమ జలము అగ్నివాయువు ఆకాశము కమ్ముకొని నీళ్లలో టెంకాయల వలె ఆ నాలుగు భూతములు తేలుచుండెనట! ఆ యండములో ఆ నారాయణమూర్తి రాజసగుణ మవతరించి సర్గ కారణ కర్తయై బ్రహ్మదేవుడు పుట్టినాడట! ఇతని చీలమండ మేరుపర్వతము. మావి, కొండల సమూహము. గర్భ వారి, సముద్రములు. ఈయన మూర్తి విశేషమే గొప్ప తేజస్సు. ఆ నారాయణుని సత్వగుణము విష్ణువైపుట్టి భూత రాసులను సంరక్షించును. ఆయన, తామసగుణమే రుద్రుడై పుట్టి చరాచరములను, ప్రళయములను కలుగజేసి నశింప జేయును. ఇట్టి ప్రళయము లెన్నియో వెళ్లినవి. ఎన్నియో రానై యున్నవి. ఇవి యన్నియు, నారాయణునకు వినోదములు. ఈ సృష్టియంతయు, ఆయనకు సహజమనుటయేగాని, దీనికి వేరుకారణము చెప్పజాలమట!

అట్లు పుట్టిన బ్రహ్మదేవుడు, చింతించి, బుద్ధిపూర్వకంబుగాని ధ్యానంబున, తమోమయము, తమోమోహము, తమిస్రము, అంధతమిస్రకమును వానిని పుట్టించెనట! ఇవి

తనకు సాధనములు కాకపోవుటచే, తన జ్ఞానాజ్ఞానములచే పశుమృగాదులు పుట్టించెనట! తన సాత్వికజ్ఞానముచేత, దేవతలును, తన రాజసగుణముచే మనుష్యులును జన్మించిరట! అతని నిఖిలావయములనుండి, దేవాసుర పితృ మనుజాది చరాచరమంతయు పుట్టెనట? వారి పూర్వకర్మలనుబట్టి వారివారి జన్మలేర్పడినవట! ప్రళయమునకు పూర్వమందుండి ఆ ప్రళయములో నశించినవారికర్మసంచయము వారిని వదలదుకాబోలును! బ్రహ్మసాత్వికుడైనపుడు అతని ముఖమునుండి బ్రాహ్మణులును రాజసగుణముచేత బాహువులనుండి రాజులును రాజసతామసప్రికృతిచెందినపుడు ఊరువులనుండి వైశ్యులును అతితామసోద్రిక్తుడైనపుడు పాదములనుండి శూద్రులును పుట్టిరట! వీరి ధర్మములు వేరుగానుండి పూర్వకర్మనుబట్టి పుణ్యవంతులుగను పాపవంతులుగను బుట్టించునట. కొందరిని రాజులుగను, కొందరిని భటులుగను, కొందరిని ధనవంతులుగను, కొందరిని బీదలుగను, కొందరిని జ్ఞానులుగను, కొందరిని పిచ్చివారుగను, కొందరిని ఆరోగ్యవంతులుగను మరికొందరిని రోగులుగను సృజించునట! వీరందరికిని జీవనోపాయములు మొదలగునవి బ్రహ్మ మొదటనే కల్పించెనట! ఇట్లు ఎన్నిసారులు ప్రయత్నించినను జగములు పరిపూర్ణతతో విలసిల్లకపోవుటచే అతని భ్రూయుగ్మమునుండి కోపోద్దీపితుడైన రుద్రుడు భార్యతో పుట్టి వారిద్దరినుండియు నేకాదశ రుద్రులు జనించిరట! ఇది

గాక బ్రహ్మగారు గాంభీర్యప్రాభవముగల మతితో తనవంటి వాని నొకని స్వాయంభువు అను ఆదిమనువును సృజెంచెనట! మానసపుత్రులు కొందరుదయించి, ప్రజల నుత్పత్తిచేసిరట!

ఈ పురాణములో చెప్పిన బ్రహ్మసృష్టిని ప్రకృతిశాస్త్రజ్ఞులు, ప్రత్యక్ష ప్రమాణమువలన కనిపెట్టిన సృష్టిపరిణామముతో కొంచెము పోల్చిచూడుడు. ప్రకృతి అనాది. దీని పుట్టుకను గురించి యింతవరకు యెవరికిని యేమియు తెలియు లేదు. మన కంటికిని దూరదర్శన యంత్రమూలమునను కాన బడు కోటానకోట్ల సూర్యనక్షత్రాదిగోళము లన్నిటిలోను ఉన్నపదార్థ మొక్కటే యని పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞులు కని పెట్టిరి. ప్రస్తుతము మనకు రసాయనపదార్థ శాస్త్రములను బట్టి సదరు పదార్థమునకు (substance) స్థూలద్రవ్యము (matter) శక్తి (Force or energy) అను రెండు లక్షణము లున్నవి. ఈ రెంటును యెన్నివిధములుగ మారినను, వాని మొత్తము పెరుగదు, తగ్గదు. ఈ కోటానకోట్ల బ్రహ్మాండములు, ఆకాశములో అన్యోన్యాకర్షణశక్తులను బట్టి ఉండలవలె వ్రేలాడి తిరుగుచు, ఒకదాని నొకటి డీకొని నశించుచున్నను, వానిపదార్థము డీకొనిన వేడిమిచే, తిరిగి మరికొన్ని అగ్నిగోళములుగ నేర్పడి, పూర్వపు స్థూలద్రవ్య శక్తుల పరిమాణములు తగ్గక అట్లనే యుండును. ఈశక్తిచే, ఈ అండములు ఒకదాని నొకటి ఆకర్షించి బంతులవలె ఆకాశమందు నిలబడుచు, కాలక్రమమున వీనిలోని ఉష్ణము

తగ్గినపుడు ఆకర్షణశక్తి తగ్గిపోయి సమీపముననున్న ఒక పెద్ద గోళముతో ఢీకొని పటాపంచలై తత్ఫలితముగ నూతన గోళములు యేర్పడి ఆవిరిచేత కమ్మబడి యివి క్రమముగా చల్లారినపుడు ఆ యావిరి ఘనీభవించి వానిమీద పెద్ద సముద్రములుగ ఉదక మేర్పడును. మన మిప్పుడు చూచుచున్న నక్షత్రములనేకములు, మన సూర్యునికంటెను అనేకరెట్లు పెద్దవై మన భూమివంటి గ్రహములు వానిచుట్టు తిరుగుచు, ఆ గ్రహములు చుట్టూ తిరుగు అనేక చంద్రులుండవచ్చును. మనవంటి మానవులలో, మనకంటె పెద్దలో, లేక వాలఖిల్యులవంటివారో, ఆ గ్రహములలోకూడ నుండవచ్చును. ఈ గ్రహములును వానిసూర్యులునుకూడ పుట్టుచూ నశించుచునుండును. మన కంటికగపడు కొన్ని నక్షత్రముల నుండి బయలుదేరిన కిరణము లనేకవేల సంవత్సరముల క్రిందనే బయలుదేరినట్లు ఖగోళ శాస్త్రజ్ఞులు కనిపెట్టిరి. సెకండుకు వెలుతురు 185000 మైళ్లు పోగలదు. దీనినిబట్టి యెన్ని అర్బుదములవేల మైళ్ల దూరమున కొన్ని నక్షత్రములున్నవో మనము గ్రహించవచ్చును. కొన్ని నక్షత్రములు మన సూర్యులవంటి స్వప్రకాశముగలవిపుట్టి, వేయిఅర్బుద సంవత్సరములు కావచ్చును. మన మున్న భూమి యీ బ్రహ్మాండములో ఒక స్వల్ప నక్షత్రమగు సూర్యునిచుట్టూ తిరుగునట్టి ఒక అణువు. మనుష్యుడు యీ అణువులో ఒక రేణువు. ఈ రేణువుకొరకు సూర్యచంద్ర నక్షత్రాదులు

సృజింపబడినవను వెర్రిగాథలను నమ్మకుడు. మన భూమిలో నున్న ప్రస్తుత ఉష్ణము కొంతవరకు తగ్గగానే యిది సూర్యుని డీకొని ముక్కలు చెక్కలై మరికొన్ని వేడియుండలుగ మారకతప్పదు. మొదట యీ ప్రపంచము పుట్టినపుడు కలిగిన వేడిమి తగ్గుచురాగా, డీకొనుటవలన కలిగిన యావిరి దీనిమీద జలముగామారి యిది అక్కడక్కడ యినుక చుండగా మెట్టప్రదేశములు పైకి తేలి ఖండములుగా యేర్పడు చుండెను. ఈ కారణముచేతనే యిప్పటికిని మన భూమి ఒక పాలును, దీనిమీది సముద్రజలము మూడు పాళ్లునై ఈ వివిధ ఖండములలోని వేడిమి తగ్గినకొలది, సూర్యరస్మి వలనను వివిధవస్తుభాగముల కూడికవలనను, స్థావరములగు ఉద్భిజ్జములు, వృక్షములు, జంగమములగు చేపలు మొద లగు నీటిజంతువులు వానినుండి పైమెట్టుగా భూమిమీదను, సముద్రములోను సంచరించు సరీసృపములు, పక్షులు ద్విపాద చతుష్పాదములు మొదలగు ననేక విధములైన జంతుజాలములు బయలుదేరినవి. ఇది అంతయు ప్రకృతి స్వభావజన్యమైనదే కాని, దేవుడనువాడు వీనిని వేరువేరుగా తాను చేయిజేసికొని సృష్టించలేదు. నిర్జీవమైన పదార్థము నుండి అంగవిశిష్టమైన జీవపదార్థము లెట్లుత్పన్నమైనవో తెలిసికొనుటకు వివిధశాస్త్రజ్ఞులు ప్రయత్నించుచున్నారు. ఈ సృష్టిపరిణామము లోతు ముప్పాతిక మువ్వీసము కని పెట్టినారు. సమస్త జీవరాసులు, ఒకదానినుండి ఒకటి పైఅం

త్థుకు వచ్చి, తుదకు కోతులనుండి మానవుడుద్భవించెనని స్పష్టపరచినారు. ఈ క్రమవికాసమునుగురించి తెలుసుకొనుటకు అనేక శాస్త్రములు చదువవలెను. పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics) రసాయనశాస్త్రము (Chemistry), భూగర్భ శాస్త్రము (Geology), ఖగోళ శాస్త్రము (Astronomy), వృక్షశాస్త్రము (Botany), జంతు శాస్త్రము (Zoology), Physiology (జంతుదేహ ధర్మ శాస్త్రము) Biology (జీవశాస్త్రము), Pathology (రోగలక్షణశాస్త్రము), Anatomy (అంగవిన్యాసమును, యెముకలను విమర్శించుశాస్త్రము) Phenology (శీతోష్ణస్థితితో సంబంధించిన జీవితమును గురించిన శాస్త్రము), Embryology (పిండోత్పత్తి వృద్ధులనుగురించిన శాస్త్రము), Anthropology (మనుష్యవర్ణనశాస్త్రము), Entomology (కీటకశాస్త్రము), Psychology (మనస్సునుగురించిన శాస్త్రము), Ontology (సత్త్వవిచారము) Palaeontology (మృతజంతు కళేబరములను గురించిన శాస్త్రము) మొదలగు భౌతికశాస్త్రములను, వీనిలోనుండి బయల్వెడలిన అనేక ఉపశాస్త్రములను చదివినగాని, ఈ ప్రకృతి పరిణామము బాగుగా గ్రహించజాలము. ఈ శాస్త్రముల నన్నిటిని ఒక వ్యక్తి చదువుకొని వానిలో ఉత్తీర్ణుడు కాజాలడు. కాబట్టి యీ వివిధశాస్త్రజ్ఞు లందరు కూడి తమ తమ శాస్త్రజ్ఞానమును సంపుటీకరించి విషయ

నిర్ణయము చేయుచున్నారు. ప్రకృతిలో తాము కనిపెట్టిన ఫలితములను ఒకచోట గుమిగూర్చి వానిని పోల్చి చూచు కొని విషయనిర్ణయమునకు వచ్చుచున్నారు. గాని వీరు నమ్మకములమీద నెన్నడు ఆధారపడరు. ప్రకృతి రహస్య ములలో తమ కింకను తెలియనివి తెలియలేదనిస్పష్టముగ నొప్పుకొందురు.

ఈ శాస్త్రజ్ఞులచే యిప్పటివరకు కావింపబడిన పరి శోధనలను బట్టియే మన పురాణకథలను, యెంతమాత్రము సత్యములని నమ్మవలదని మనవిచేయుచున్నాను. ఇందు కుదాహరణము, విష్ణుపురాణములో కృతయుగము 17,98,000 సంవత్సరము లనియు, త్రేతాయుగము 12,96,009 సంవత్స రము లనియు, ద్వాపరయుగము 82,4,000 సంవత్సరము లనియు, కలియుగము 4,32,000 సంవత్సరము లనియు చెప్ప బడినది. ఈ నాలుగు యుగములు కలసి 43,26,000 సంవత్స రములు. ఇది ఒక మహాయుగము. ఇట్టి మహాయుగములు 71 జరుగగా ప్రళయము వచ్చి, బ్రహ్మాండమంతయు పోయి శూన్యమయమై తిరిగి జరుగవలసిన సృష్టికి మరియొక మనువు వచ్చుచుండును. కాబట్టి ప్రళయము ప్రతి 30,67,20,000 సం॥ లకును సంభవించుచుండును. ప్రకృతిశాస్త్రములను బట్టి, యిట్టి ప్రళయములు నిత్యము గోళములకు సంభవించుచునే యున్నవి. నూతనగోళములు పుట్టుచునే యున్నవి మనభూమి విషయములో భూగర్భశాస్త్రపరిశోధనలనుబట్టి, యిప్పు

దున్న పర్వతములు అనేకకోట్ల సంవత్సరములనుండి పెరుగు చున్నట్లును, ఈభూమిలో చచ్చిపడియున్న పూర్వకాలపు జీవరాసుల మృతకళేబరములను బట్టి భూమియొక్క పొరలు పైవరకు లెక్కించగా సృష్టిపరిణామములో జంతుజాలములు లక్షల సంవత్సరములక్రిందటనే పుట్టి నశించుటయు, మానవునికి, అనేక లక్షల సంవత్సరముల క్రిందటనే, కోతులనుండి ప్రకృతాకారము కలిగిదనియు, నిర్ధారణచేసిరి.

ప్రకృతిశాస్త్రజ్ఞులు కూడ, మనపూర్వ ఋషులతో పాటు, ఈ అనాదియు అదిమధ్యాంతములు లేనిదియగు ప్రకృతితత్వజననము తెలిసికొనలేక పోయినను రెండవవారి శుద్ధాద్వైతమును విడనాడి కేవలము జడాద్వైతవాదులుగ (materialistic monists) నున్నారు. వీరిదే సహేతుకమైన వాదమనియు, వీరు పోయినంతవరకు ప్రత్యక్షప్రమాణముమీద నాధారపడి మనబుద్ధి నుపయోగించి ఆవాదమును తెలిసికొన దగినదనియు నా అభిప్రాయము. శుద్ధాద్వైతుల వాదము కేవలము ఊహాప్రపంచముమీద నాధారపడి భగవల్లీల, మాయ, నిత్యమైన ఆత్మ, పరిత్తి ప్రళయాంతమున ప్రతి స్థావర జంగమ పదార్థములకు వేరువేరు సృష్టి, మొదలగు అభూతకల్పన లనేకముతో కూడియున్నది. తుదకు ఆధ్యాత్మిక విషయములు కూడ వ్యక్తి యనుభవమునకు వదలి వేయుటచేత, సామాన్యమానవులందరు యేమియు గ్రహించ జాలక, వారు చెప్పినది వేదవాక్యములని నమ్మి, దానివలన

కలుగు అనేకవిధములైన దుష్ఫలితములు, భయములు, మూఢాచారములు, మొదలగువానికి లోనుగావలసి వచ్చుచున్నది. భౌతికసృష్టి పరిణామమునే తెలియనివారు అధ్యాత్మిక విషయములలో యెట్లు మనకు ప్రమాణీకులగుదురు? ఋగ్వేదములోని నాసదీయ సూక్తములో యీ ప్రకృతి యొక్క ఆద్యంతములు, స్వభావము, ఆ హిరణ్యగర్భునికైనను తెలుసునో తెలియదో యని సందేహము వెలిబుచ్చుచుండగా, యీ అఖిలాండకోటి బ్రహ్మాండములలో ఒక అణువైన ఈ భూమిమీద, కొన్ని లక్షలక్రింద జన్మించిన ఒక రేణువగు మానవుని కొరకు అవి సృజింపబడినవని చెప్పు యీ పుక్కిటిపురాణములలోని పిట్టకథల నెట్లు నమ్మవచ్చును? వీనిలో నుదహరించబడు సృష్టిక్రమము, స్వర్గనరకములు, పూర్వజన్మము, కర్మఫలితములు, వర్ణాశ్రమధర్మములు మొదలగున వన్నియు ఎంతమాత్రము విశ్వసనీయములు కావు.

నారాయణుడు వరాహరూపమై సముద్రమగ్నంబైన భూమి నెత్తుట, అది కదలకుండ కులపర్వతముల నేర్పరుచుట, అది మునిగిపోకుండ ఒక తాబేలును, ఒక పామును దాని క్రింద నెత్తిపెట్టుట—యీ మొదలగు అభూతకల్పనలు తలయు తోకయు లేకుండ, పిల్లలకు చెప్పవలసిన కట్టు కథలతో ఈ పురాణములన్నియు నిండియున్నవి. భూమిమీద నుండిన సముద్రభాగములు వర్ణించుటకు బదులు కల్లు,

నేయి, పెరుగు, పాలు, పానకము, మంచినీళ్ళులతో నిండిన సముద్రములు, ప్రకృతిస్వభావమునకు వ్యతిరేకముగ మానవుల వివిధాంగముల నుండియే గాక, జంతువులు, వృక్షములు, రాళ్లు మొదలైన వానినుండి మనుష్యు లుద్భవించుట, సరీసృపములు, జంతువులు, పక్షులు మానవులతో సంభాషించుట—యిట్టి పిచ్చి పిచ్చికబుర్లు యింగితజ్ఞానముగల మానవుడు చదువవచ్చునా? ఒకవేళ వినోదముకొరకును, భాషాశైలికిని చదివిసను, వానిలోని విషయములు యదార్థమనియు, అవి చదివిన, వ్రాసిన, విన్న, పుణ్యము కలుగుననియు వ్రాయు వ్రాతలను నమ్మవచ్చునా? దేవుని యవతారములకు అనేకమంది భార్యల నంటగట్టుట, పదునాలుగు లోకములు, అనేకవిధములైన నరకములు కలవనుట, దుర్వాసుని శాపమువలన స్వర్గమంతయు సముద్రములో పడగా నారాయణుడు సముద్రమథనముచేసి, దానిని తిరిగి యింద్రునికిచ్చుట, సముద్రమునుండి బయల్వెడలిన లక్ష్మిని, ఆయనభార్యగా స్వీకరించుట—యిట్టి వింతకథలెన్నియో యీ పురాణములో నున్నవి. ఇవి మన సంఘశైశవదశలో అప్పటి మూఢులకు, కొన్ని నీతులు, దైవభక్తి యుపదేశించుటకు వ్రాయబడి యుండవచ్చునుగాని, దానిఫలితము లను మనమిప్పుడు చూచుచున్నాము. ఆ సేతుహిమాచలము వరకు యీ పురాణములు మతగ్రంథములుగ నేర్పడి విషయనిర్ణయశక్తిని జనసామాన్యములో అడుగంటచేసి వెర్రినమ్మ

కములకు తావొసంగి సంఘమును దుర్బలముగ చేయు చున్నవి. ప్రకృతిశాస్త్రపరిశోధనకు కావలసిన బుద్ధియభి వృద్ధికి ఆటంకములు కలుగ జేయుచున్నవి. ఇవి మన మతగ్రంథములుగా అంగీకరించబడుచున్నపు డిక వేరుగ చెప్పవలసిన దేమి? విద్యాధికులు కూడ తమజ్ఞానము నుపయోగించక యీ పురాణకాలక్షేపములలో పాల్గొని మూఢమతగురువు లకు దాసులగుచున్నారు.

---

## 13 వ అధ్యాయము

### సృష్టి పరిణామము

ప్రకృతిలో, స్థూలద్రవ్యము, శక్తి, (Matter and force) అనునవి ఒక వస్తువులో నుండియే యుద్భవమనియు, యివి హెచ్చుతగ్గులు లేక, యెన్నటికి నశించవనియు, ప్రకృతి అనాదిగా నున్నదనియు, ఒప్పుకొన్నయెడల, యిక యీశ్వరుడొక డెక్కడనుండి రాగలడనే. విషయ మును గురించి, యే మతగ్రంథముగాని నిశ్చయముగ చెప్ప జాలదు. పైసమస్యను పరిష్కరింపజాలదు- పరిచ్ఛిన్నుడైన మానవుడు అపరచ్ఛిన్నమైన ప్రకృతియొక్క పుట్టుకను యెట్లు

తెలిసికొనగలడు? ఋగ్వేదములోని పదియవ మండలియం దలి 129 వ సూక్తములో యిట్లు చెప్పబడెను:— "సత్తు యొక్క యీ వ్యాప్తి యెక్కడనుండి వచ్చెను? ఇచ్చో చెప్పువాడెవరు? నిశ్చయముగ తెలిసికొన్నవారెవరు? దేవతలు సైతము, విసర్గాంతమునసే పుట్టినవారు. మరి యీ ప్రకృతి యెచ్చోటనుండి వెలువడినదియు నెవరెరుంగుదురు? సత్తుయొక్క యీ వ్యాపనము (విసర్గము) యెచ్చోటనుండి వచ్చినది? లేక, అది నిర్మించినను, నిర్మింపకపోయినను సరే. అది పరమమగు నాకాశమునందుండెడి జగత్తునకు నధ్యక్షుడగు హిరణ్యగర్భుడనువాడెరింగియుండునేమో! లేక యెఱుంగక సైత ముండవచ్చును; యెవరు చెప్పగలరు?" వేదములలో కొన్నిచోట్ల, మొదట అంతయు అంధకారమనియు, కొన్నిచోట్ల జలమనియు, కొన్నిచోట్ల ఆకాశమే సర్వమునకు మూలమనియు, కొన్నిచోట్ల సర్వము మృత్యువుచేతనే యాచ్ఛాదింప బడినదనియు, మరికొన్నిచోట్ల అసత్తునుండియే సత్తు బయలుదేరినదనియు, యిట్లు పరిపరివిధముల సృష్ట్యుత్పత్తిని గురించి మన ఋషులు ఊహించియుండిరి. ఇక నిటీవల బయలుదేరిన పురాణములలోని, సృష్ట్యుత్పత్తి కథలను మన మెట్లు విశ్వసించగలము? మనుస్మృతిలో కూడ యిట్లు వ్రాయబడి యున్నది:—ఈ సమస్తమును తొలుత అంధకారముచే వ్యాప్తమైనందున, భేదాభేదముల నెరుంగుటకు యోగ్యము కామిచే నగమ్యముగ నిదురించునటు లుండెను.

పిదప దాసియందు అవ్యక్తపరమాత్మ ప్రవేశించి, జలమును ప్రారంభమున సృజించెను.''

మనము సృష్ట్యాదిని తెలిసికొనలేకపోయినను, పదార్థ విజ్ఞాన శాస్త్రమును బట్టి, మనకు కనపడు అఖిలాండకోటి బ్రహ్మాండముల పదార్థతత్వ మొక్కటేయని స్థిరపడినది. దానినుండియే, స్థావర జంగమములన్నియు, క్రమేణా ఒక దానినుండి ఒకటి వెలువడి, ప్రకృతి వికాసమంతయు నేర్పడినది- జీవపదార్థము, మానవుల మెదడు, జ్ఞానము మొదలగునవన్నియు, ఆ మొదటిపదార్థ పరిణామమే గాని, పరమేశ్వరుడనువాడు, వానిని ప్రత్యేకముగ సృజించినాడనుట పొరబాటు.

ప్రకృతియే పరమేశ్వరుడనవచ్చును. పురుషుడు వేరు, ప్రకృతి వేరుగా భావించుటకెట్టి కారణములు కనుపడవు. ఒకవేళ అట్టివాడొకడున్నను, అతడెందుండి వచ్చెను? స్వాయంభువు అని చెప్పినంతమాత్రమున, మన మనస్సు తృప్తిపడునా? ఒకవేళ తాను తటస్థుడుగనుండి, తన యిచ్ఛామాత్రముననే, ప్రకృతిని పరిణామము నొందునట్లు చేసియుండెనేని, తాను మధ్యమధ్య వ్రేలుపెట్టి సృష్టిక్రమములో జోక్యము కలుగజేసికొన నవసరములేదు గనుక, ఆయనతో మనకు సంబంధ మెందుకు? ఆయన మన ప్రార్థనలనుగాని దూషణలనుగాని లక్ష్యము చేయునా? తాను ప్రపంచములోని దుర్మార్గులను శిక్షించుటకును, సన్మార్గులను రక్షించు

టకును, యీ ప్రపంచములో అవతరించు టెందుకు? ప్రకృతి వ్యాపారమును బట్టి మన కర్మలకు మనమే కర్తలమైనప్పుడు, యీ దేవుళ్లు దయ్యముల సంబంధములు మన కేల?

కాబట్టి పురాణములలో వ్రాయబడిన సృష్టిక్రమము కేవలము ఊహలమీద వ్రాయబడినది. ప్రతి 432 కోట్ల సంవత్సరములకును మహాప్రళయము యీ సృష్టి నంతయు నశింపజేయు ననియు తిరిగి నూతనసృష్టి ఆరంభమగుచుండు ననియు మన పూర్వుల యభిప్రాయము. ప్రకృతిశాస్త్రపరిశోధనలను బట్టి, యీ కోట్లసంఖ్యగల సూర్యనక్షత్రాది ఖగోళములలో, నిత్యము, యెక్కడనో ఒకచోట ప్రళయములు జరుగుచునే యుండుననియు, ప్రకృతి యంతయు యెన్నడు ఒక్కసారిగా నశించినట్లు దృష్టాంతము లేవియు లేవనియు, మన భూమిమీదనే అనేక ప్రళయములు జరిగినవనియు, యిప్పుడును జరుగుచున్నవనియు, స్థిరపడుచున్నది. జలభాగములు భూభాగములుగను, భూభాగములు జలభాగములుగను, అనేక కారణములచేత మారుచున్నవి. భూగర్భపరిశోధనలను బట్టి, దాని పొరలను, సాధ్యమైనంతవరకు లెక్కించుకొనిరాగా యీ భూగోళముయొక్క ఆదియే, అనేకవేల అర్బుదముల సంవత్సరములక్రింద నున్నట్లు కనుపడుచున్నది. ప్రస్తుతాకారముగల మానవులు, సుమారు పదిలక్షుల సంవత్సరములక్రిందట, భూగర్భములో 15000 అడుగుల లోతున తప్ప, అక్రింద భాగములో కనుపడరు. అక్కడ తోకలుకేసి

కోతుల కళేబరములు కాన్పించినవి. ఈ భూమిమీాద నున్న జంతుజాలములు, వృక్షములు, పురుగులు, చేపలు, మొదలగునవియన్నియు ఒకదానినుండి ఒకటి పుట్టుటయు, వానిలో కొన్ని ఆయా కాలములలో బొత్తిగా అంతరించుటయు, భూగర్భశాస్త్రి, పిండోత్పత్తిశాస్త్రి, జీవశాస్త్రి, వృక్షశాస్త్ర, శారీరకశాస్త్ర, జంతుశాస్త్రములవలన తెలియగలదు.

అనేక ఉల్కాపాతములవలననే యీభూమి మొదలగు గోళములు పుట్టినవి. పుట్టుచున్నవి. నశించుచున్నవి. ఈజిప్టు దేశములో నైలునది ప్రాంతమున ఒకచోట ఒండుమట్టిని త్రవ్వుచు పోగా, శిలారూపమైన జంతువుల కళేబరములు 3,50,000 అడుగులవరకు కనుపడినవి. 500 సంవత్సరములకు ఒక అడుగువంతున, ఆవరేజీమీాద యిక్కడి భూమిమీాద పొరలు యేర్పడినట్లు యెంచేయెడల, జీవకోటి ప్రారంభించినది 175,000,000 సంవత్సరములై యుండవలెను. ఇవిగాక, మరి యిన్నిపొరలు, యింకను వీనిక్రిందనున్నవట! మృతకళేబరముల యెముకలను పరిశోధించు శాస్త్రిము (Palaeontology) ను బట్టి, యిప్పుడు మనము చూచుచున్న కొన్ని వృక్షములు, జంతువులు ఒక కాలమందు లేనేలేవనియు యిప్పుడు కనుపడనివి, ఒక కాలమం దున్నవనియు, మానవ కళేబరముల యెముకలు కనుపడని పొరలవరకు పోగా అక్కడ తోకలేని కోతుల కళేబరములు అనేకము దొరకు

చున్నవనియు యీ విధముగానే పోగా పోగా క్రిందిక్రింది తరగతుల ఉద్భిజ్జములు, జంతువులు, పక్షులు, సరీసృపములు, చేపలు, పురుగులు, వరుసగా కనుపడు చున్నవనియు స్పష్టమైనది- ఈ గొలుసులో యింకను కొన్ని కొక్కెములు పరిశోధకులకు దొరకలేదు గాని, దొరికినవానినిబట్టి, సృష్టిలోని జీవముల క్రమపరిణామమును నమ్మటకు తగిన ఆధారములు కలవు-మానవుని పూర్వులు తోకలు లేనట్టియు, రెండుకాళ్ళ మీద నడవగలట్టియు కోతులని చెప్పుకొనుటవలన, మన మెంత మాత్రము సిగ్గుపడ నక్కరలేదు. వాని మెదడుకంటె, తన మెదడును మెన్నిరెట్లో మనుష్యుడు అధికముగ చేసుకొని, మాటలు నేర్చుకొని, తరువాత వ్రాతనేర్చుకొని, యింగితజ్ఞాన మలవరచుకొని, ప్రకృతిరహస్యములను కనిపెట్ట గలిగినప్పుడు, అతను గర్వపడవలసినవాడే.

మనుష్యునికి మిక్కిలి సమీప పూర్వీకులు, యీ కాలములో కనుపడుచున్నచింపాంజి, గొరిల్లాలవంటి కోతులు-వీనికంటెమనకు కొంచము దూరపు జ్ఞాతులు, ఓరాంగొటాంగు, గిబ్బనులవంటి కోతులు-రక్తమును,యెముకలను, చేష్టలనుపోల్చి చూచినయెడల మరి యేయితరజంతువు, మానవునికి,కోతికంటె సమీపమైనది లేదు. కోతి మెదడులోని వివిధ భాగములు సరిగా మానవుని మెదడును పోలియున్నవి- రెంటి పిండములను పరిశోధించిన యెడల యెట్టి భేదమును కనుగొనజాలము. క్రమక్రమముగా మానవుని మెదడు, వంశపారంపర్యముగ కలి

గిన శక్తిచేత శీఘ్రకాలములోనే, కోతిబానికంటె వృద్ధి యగుచున్నది.

కాబట్టి పైన చెప్పిన సృష్టిక్రమమును, మన పురాణములలో వ్యాసులవారు వ్రాసిన సృష్టిక్రమమును, చదువరులు పోల్చి చూచుకొనవలెను. తమ బుద్ధిని ఉపయోగించుకొనవలెను. భౌతికశాస్త్రజ్ఞులు, ఊహలమీదనే యాధారపడరు. తమకు తెలియునిది తెలిసినట్లు వ్రాయరు. వీరిలో భిన్నజాతులవారు భిన్నశాస్త్రములలో పారంగతులై, ఒండొరుల పరిశోధనలను పోల్చి చూచుకొనుచు, తమ స్వకీయనిర్ణయములను దిద్దుకొనుచుందురు. ఎంతవరకు తమ పరిశోధనలు ప్రత్యక్షప్రమాణములమీద నిలచినవో వ్రాయుచు, అటుపిమ్మట, వీనిని బట్టి, ముందు తెలిసికొనవలసినది, యిట్లుండవచ్చునని ఊహించి, నూతనపరిశోధనలకు దిగుచుందురు. వీరి తలంపులు, భ్రాంతులు, భావములే భౌతికశాస్త్రాభివృద్ధికి సోపానములు. వివిధదేశనివాసులగు, హాంబోల్టు, హెలము హోల్ట్సు, లామార్కు, వాలెసు, కూవియర్, డార్విన్, హక్స్లి, లాడ్జి, స్పెన్సరు, హ్యూయము, మిల్లు, హకెల్, లీద్, తామ్సన్, ఆడమ్సు, హర్షెల్, న్యూటన్, వాట్సు, స్టీవెన్సన్, గ్రేగరీ, కీత్, గ్రీన్లి, లెయింగు, క్లాడ్, న్యూమన్, మొదలగు వివిధ శాస్త్రజ్ఞులు నాస్తికులు కారు. తమకు తెలియని విషయములు, యింకను తెలియలేదని స్పష్టముగ చెప్పుచు, యెంత వరకు, ప్రత్యక్షప్రమాణముమీద ప్రకృతిరహస్యములను మన

యింద్రియములకు గోచరింపచేయగలరో, అంతవరకే అవి సత్యములనియు, తక్కినవి ఉత్త ఊహాజన్యములనియు, నిష్కపటముగను, నిష్కర్షగను చెప్పుచు, మన హేతువాదశక్తికి వాని నిర్ణయములను వదలివేయుదురు. మన పురాణకర్తలట్లు కాదు. తమరు నమ్ముటకు హేతువులను చూపించరు సరికదా, తమరు చెప్పినవి నమ్మవలసినదనియు, నమ్మినయెడల లేక చదివిన, లేక విన్నమాత్రముననే, స్వర్గప్రాప్తి కలుగునని మనలను హెచ్చరించెదరు. ఇది సమంజసమా? నేను స్థాలీపులాకన్యాయముగ, యిదివరకు బ్రహ్మాండవిష్ణుపురాణములలోని సృష్టిక్రమమును, కొన్నికథలను, మీకు చూపించియుంటిని. వానిని వ్యాసులవారు చెప్పినవి గనుక మనము నమ్మవలసినదేనా,? సహేతువులతో యెంతవరకు, వానిని నమ్మినవారు రుజువు చేయగలరు? మన వ్యాసులవారు సదుద్దేశముతోనే, నమ్మియే వానిని వ్రాసియుండుట నిశ్చయము. ఆయన లోకవంచకుడేమాత్రము కాడు. తన యూహలనుబట్టి వ్రాసెనని మన మెంచవలయును. లేదా, తనకంటె పూర్వులగు పెద్దలమాటలను బట్టి, మనకొరకట్టి పురాణలములను వ్రాసియుండవచ్చును. వీరిని గాని, వీరి మాటలు భగవంతునివే యని నమ్మినట్టి పూర్వసాంప్రదాయపరులను గాని, నే నెన్నడు దూషించను. వీరు పొరబడిరని చెప్పుటకు మాత్రము సాహసించెదను. కాని, యిప్పటి నవనాగరికులు, విద్యాధికులు, జ్ఞానులు, పండితులు,

ఆధునికవిజ్ఞానమంతయు వ్యాసులు మొదలగు మన పూర్వులకు తెలుసుననియు, వారు రచించిన గ్రంథములలోనున్న విషయములన్నియు సత్యములనియు నమ్మి ఆధునికభౌతిక శాస్త్రపరిశోధనలను త్రోసివేయజాలక, రెంటిని సమన్వయముచేసి, తమ తెలివితేటల నుపయోగించి, యీపుక్కిటి పురాణములలోని విషయముల నన్నిటిని సమర్థింపజూతురు. ఇట్టివారే సంఘమునకు మిక్కిలి అపకారము చేయుచున్న వారు. అపాయములను కలుగజేయువారు. మనోభానిసత్వమును స్థిరపరచజూచువారు. ఇట్టివారే, నిజమైన జ్ఞానాభివృద్ధికి విరోధులు—వీరినే, దయదాక్షిణ్యరాహిత్యముతో కఠినముగ విమర్శించవలెను. అభూతహేతువులను కల్పనచేసి, తమ జ్ఞానమును, దుష్టవినియోగముచేసి, అమాయకులైన ప్రజలను, యెప్పటికిని మూఢవిశ్వాసములు మూఢాచారములకు లోనగునట్లు చేయుటకు సంకోచించరు. తాము వానిని త్రికరణశుద్ధిగ నమ్మరు. తమకేమో పూర్వులయందు గొప్ప గౌరవమున్నట్లు నటించుచు, పూర్వాచారపరాయణులమనే పేరు చౌకగా సంపాదించుకొన దలతురు. పురాణములకు రహస్యార్థములు, అంతరార్థములు, విపరీతార్థములు చెప్పి, వానిని భౌతికశాస్త్రపరిశోధనలతో ముడిబెట్టజూతురు.

వ్యాసులు మొదలగు వారియెడల, యీ పూర్వాచారపరాయణులకంటె, నాకు గౌరవము తక్కువుగలేదు. ఆయన తండ్రియు, వశిష్ఠమహాముని మనుమడు నగు పరా

శరులవారు నాగోత్రప్రధానపురుషులు. వీ రుపదేశించిన నీతి ధర్మములు, సాంఘికధర్మములలో అత్యుత్కృష్టములును, నేటి కిని ఆచరణయోగ్యములగునవియును కొన్ని యున్నమాట సత్యము. నేను, నాపూర్వుల యెడల కృతజ్ఞతయు, గౌరవ మును చూపించుట స్వాభావికమే—నాకును గర్వమే. కాని నా తండ్రియందైనను, నా కొమాళ్లయందైనను సరే, లోప ములున్న యెడల, నేను కఠినముగ విమర్శించక మానను. మా పరాశరులవారు తన కంతవయస్సు వచ్చి, మత్స్యగం ధితో సంభోగించనేల? మా వేదవ్యాసులవారు, ముసలివా డైనను, తన సవతితల్లి భార్యలయందును, వారి దాసీదాని యందును బిడ్డలను కనుటయేల? మనకిట్టి పనులు, యేవ గింపులును, కంటగింపులును అయినను ఆకాలములో అవి ధర్మములై ప్రజలలో యెబ్బెట్టులేని వగుటచేత, యీ మునిశ్రేష్ఠు లట్లొనర్చిరి. మా వశిష్ఠులు మాలదానిని వివా హము చేసికొనెను. ఆమె మహాపతివ్రత యని యిప్పటికిని భారతదేశము మంతటను చెప్పుకొందురు. మా వశిష్ఠుని కొమారుడు శక్తి, గొప్పజ్ఞాని యైనను, అతికోపియగుటచే, తండ్రిచేత మందలింపబడవలసివచ్చెను. ప్రస్తుత నైతిక సాంఘిక ప్రమాణములు వేరై యున్నను, వారి చర్యలు, నేను సమ ర్ధించుటకు పూనుకొన్న యెడల, నేను పరిహాసపాత్రుడ నగు దును. మా వ్యాసులవారు వ్రాసిన అభూతకల్పనలను ఆయన యేయుద్దేశ్యముతో వ్రాసినను, నేను పసిబాలురతో కూడ

నమ్మవలెనని చెప్పెదను. ఆ ఋషులు గొప్పజ్ఞానులు కావచ్చును. కాని వారు చెప్పిన మాటలు, చేసిన చేష్టలు, నేను నిరసించక తప్పదు. మా పరాశరులవారు, తన తల్లి గర్భమం దుండగనే, సమస్త శ్రుతిస్మృతిపురాణేతిహాసాదు లన్నియు అభ్యసించినా డట! ఇది యేటిమాట! నేను సత్యమని నమ్మి వ్రాయు యభిప్రాయములను, ప్రజలు విమర్శించుట కెట్టి సంపూర్ణ మనస్స్వాతంత్ర్యములు కలిగియుందురో, మన పూర్వులు సత్యములని వ్రాసిన వానిని మనకు విమర్శించుట కధికార మున్నది. మా వ్యాసులవారికంటెను ఆయన కొమారుడు శుకమహర్షి యెక్కువజ్ఞాని. కాని, యీయన కౌపీనమును కూడ విసర్జించి, స్త్రీ లున్న స్థలమునకు వచ్చుట నేను నిరసించెదను. వేదాంతవేద్యు డగు వ్యాసులవారు, తన కొడుకు యేమైపోవునో యని, అతనివెంట యేల పరుగెత్తవలెను? ఈయన సర్వజ్ఞుడని నే నెట్లు ఒప్పుకొందును? ఆకాలములో నున్న యాచారములు యెట్లు పనికిరావో వారి యూహాలు కూడా, యిప్పటి భౌతికశాస్త్రపరిశోధనలవలన కూలిపోవు చున్నవి. కొబట్టి, ఓ చదువరులారా! మీరు మనోబాని సత్వమును వదలి, మీ తాత తండ్రులు, తెలిసియో, తెలియ కనో చేసిన పనులను, ఆడిన మాటలను, తూచా తప్పకుండ అనుకరించక, సత్యాన్వేషణపరులై, ప్రతివిషయమును, సహేతుకరముగ ఆమోదించుటకును, నిరశించుటకును, సంపూర్ణ మనస్స్వాతంత్ర్యముతో మీ మెదడును బుద్ధిని ఉపయో

గించి, తుదినిర్ణయములకు వచ్చుచుండును. మా వశిష్ఠుడు, శక్తి, పరాశరుడు, వ్యాసులు, శుకమహర్షియు చేసిన కార్యములను నే నేల చేయగూడదని పట్టుపట్టినయెడల యీ పాటికి, నవ్వులపాలై, సంఘమునుండి బహిష్కరింపబడుటయే గాక, కారాగృహప్రాప్తి కూడ నాకు సంప్రదించి యుండును.

పురాణములలోని సృష్టిక్రమము ప్రత్యక్షప్రమాణమునకు విరుద్ధముగ నున్నపుడు, వానిలోని తక్కిన విషయములు సత్యములని యెట్లు నమ్మెదరు? అతల, వితల, తలాతల, మహాతలము మొదలగు పదునాలుగులోకములు, స్వర్గనరకములు, కైలాస, వైకుంఠ, బ్రహ్మలోకములు, పాలు పెరుగు మొదలగు సప్తసముద్రములు, యింక ననేకములగు అభూతకల్పనలు, అతిశయోక్తులు, అపురూపపు మనుష్యులు, అద్భుతచర్యలు, విడ్డూరపుగాథలు, అమానుషక్రియలు, మొదలగు వానిని యెట్లు నమ్మగలము? మన పూర్వులు, సాంఘికశైశవదశలో నమ్మిన యభిప్రాయములు, పడెడు ఊహలు, యీ యిరువదవ శతాబ్దములో మన కెన్నటికిని ప్రమాణములు కావు. మన బుద్ధి నుపయోగించి, సత్యము నరయుటకు ప్రయత్నింతము. ఈనాటికి కావలసిన మార్పులు, మన సంఘాభివృద్ధి కవసరమైనవి మనము చొప్పింప కంకణము కట్టుకొందము.

---

## 14 వ అ ధ్యా య ము

### మ త వి మ ర్శ న ము

పురాణములుగాని, మరియే యితరమతగ్రంథములు గాని, కొందరకు పవిత్రములైనంత మాత్రమున, వానిని విమర్శించకూడదా ? ఎంతమంది వానిని సత్యములని నమ్మిననేమి? సహేతువులతో వానిని విమర్శించబూనుట, సాహసమెట్లగును? ఎవరైనను, తమకు సత్యమని నమ్మినదానిని వెల్లడించకూడదా? అసత్యమును తొలగించుటకు ప్రయత్నించకూడదా? విమర్శనచేయుట అనర్థహేతు వెట్లగును? విమర్శనలో లోపములున్న, వానిని ఖండించవచ్చును. నా తాతల తప్పులను నేను బహిరంగపరిచినచో, వారియెడల నాకు గౌరవము లేదనియా? వారి కప్పటికిగల భౌతికవిషయకజ్ఞానము కొఱవడియున్నదనియు, వారు సదుద్దేశ్యముతోనే కొన్నికథలను, ధర్మబోధనకొఱకు అల్లినను, ఆధునిక యుగములో, వానివలన కలుగుచున్న కొన్నిదుష్ఫలితములను వెలిబుచ్చి, మూఢవిశ్వాసములను పోగొట్టుకొనవలెననియు, ప్రజల నుద్బోధించకూడదా ? సనాతనధర్మవాదులు పూర్వకాలపు టాచారములనన్నిటిని తూచాతప్పక నిలబెట్టుటకు యెంత విశ్వప్రయత్నములు చేయుచున్నారో, అటులనే, సంఘసంస్కరణవాదులు,

వానిని కూలద్రోయుటకు ప్రయత్నించకూడదా? వాఙ్మనః స్వా తంత్ర్యములు ఉభయులకు సమానమేకదా! వీరుభయులమాట నటుంచుము. ప్రపంచములోని కొమ్ములుతిరిగిన మేధావంతులు మతకర్త లెవ్వరైననుసరే, ప్రపంచములోని ప్రజలందరిని తమ యభిప్రాయముల నంగీకరింప చేయుగలిగిరా? మనమనగా నెంతవారము? ఇంతమాత్రము చేత విమర్శనలేకూడదని చెప్ప వచ్చునా? తమకుతోచిన సత్యాసత్యములను వ్యక్తిదూషణ లేకుండ నిర్భయముగ వెల్లడించుటయు, వానిని ప్రతిపక్షులు విమర్శించుటయు జరుగుచున్నప్పుడే యే మానవసంఘము గాని స్తంభించక, అభివృద్ధి నొందుచుండును. నేనుచేయు విమ ర్శనలను, తప్పులతడికెలని నిరూపించుటకు ప్రతి వానికిని సంపూ ర్ణాధికారము కలదు. సహేతువులు వాని వాదనలో కనుపడి నపుడు, యేల ప్రజలంగీకరించరు? నే నేల దిద్దుకొనను? వానిని నిరాకరించువారు కేవలము దురభిమానముకలవారు. ఇట్టి దురహంకారము మతావేశపరుకుల కెక్కువగా నుం డును. విమర్శనలవలన ప్రజలకు లాభమేగాని, నష్టమెంత మాత్రము రాదు. ఎవరును, మనహేతువాదములను ఒప్పు కొనరనియు, తమమత విశ్వాసములను వదులుకొనరనియు చెప్పుట మిక్కిలి సాహసము. మూఢనమ్మకములు అనేకు లలో పటాపంచలై పోవుచుండును. ఆచరణయోగ్యములు కావున గ్రహించి వానిని జనులుత్యజించు చుందురు.

నా విమర్శనమువలన, వేయికొక్కడైనను, నాతో

మేకీభవించినను నాకుచాలును. ప్రజలందరు నేను వ్రాయు నదియే వేదవాక్యమని నమ్మెదురని యనుకొనునంత పిచ్చివాడనుగాను. గుణగ్రహణ పారీణులు, దానిలో నెంతసత్యమున్న దనుకొందురో అంతయే నమ్మనిండు. మతవిషయములను చర్చించునపుడు, అనేక మతాచారపరులకు విమర్శనలు కష్టముగానుండునని నాకు తెలియును. కాని, ప్రస్తుత భౌతికశాస్త్రజ్ఞానమునుబట్టి, మనలోనున్న మూఢవిశ్వాసములను విమర్శించునపుడు, శ్రుతిస్మృతి పురాణేతిహాసాది మతగ్రంథములలోని విషయములను విమర్శింపక తప్పదు. వానిని ముట్టుకొనకూడదన్నయెడల, వానిమీద నాధారపడిన యిప్పటి నిరర్థకాచారకాండయు, మూఢవిశ్వాసములను విమర్శించుటెట్లు? వీనిని ప్రజల మనోవీథులనుండి తొలగించి, వారి మనోబానిసత్వమును పారద్రోలి, నిర్భయులుగ జేసి మనుష్యులుగ నిలుపుటకే యిట్టివిమర్శనలు తప్పక తోడ్పడును. పాపము! కొందరు పూర్వాచార పరాయణులకు ఇట్టివిమర్శనలు కష్టముగ నుండును. కాని, వారియందు జాలిచూపించుట తప్ప, యీ విమర్శకు లేమిచేయగలరు ? వారినెన్నడు దూషించము. సత్యాన్వేషణమును మాత్రము యీ యాధునిక నవయుగములో యేమానవుడు కాదుగదా పూర్వపు శ్రీరామావతారము వచ్చినను అరికట్టజాలదు.

మంచిచెడ్డలను, సత్యాసత్యములను, నిర్ణయించుటకు ప్రతివాడును ప్రయత్నించవలెనుగాని, యెవరో, యెప్పుడో

చెప్పినదంతయు తానాలోచించుకొనక తన యనుభవము నంతయు త్యజించి, గుడ్డివానివలె యెప్పటికిని నమ్మవలెనని చెప్పుట, మనోబానిసత్వమునే సూచించును. అట్లునమ్మువాడు మానవునికంటె యధముడు. మనలో సంఘసంస్కరణము, పూర్వ మతఖండనముమీదనే యాధారపడవలసి యున్నది. సంఘసంస్కరణాభిలాషులు నూతన మతమేర్పరప దలచలేదు. వేదకాలమునుండియు, యిట్టిసంస్కరణ లనేకములు జరుగుచునే యుండెను. మన ఆర్యమతములో, అనేకమంది చార్వాకులు, నాస్తికులు, సంశయాత్ములు, పలుతరగతులగు వేదాంతులు, మొదలగు వారుద్భవించి, వివిధమత సాంప్రదాయములను నెలకొల్పలేదా? వారు సంఘసంస్కరణ వాదులుగాక మరియెవరు? ఋగ్వేదములోని నాసదీయ సూక్తము, కాణాదుని ఆరంభవాదము, కపిలుని ఉత్క్రాంత వాదము, ఉపనిషత్తులలోని అద్వైతవాదము, తాంత్రికుల మతము ద్వైతమతము మొదలైనవానిని కొంచమైనను చదివిన యెడల, యెట్టివిమర్శనలు మతఖండనములు జరిగియుండెనో గ్రహించగలము. ఇటీవల బుద్ధదేవుడు, మహావీరుడు, దయానందసరస్వతి రాజారామ మోహన్ రాయలును యెట్టి సంస్కరణాలను చొప్పించిరో మనకు తెలిసియే యున్నది. పూర్వాచారపరాయణులలోనే భక్తి, జ్ఞాన, కర్మ, కాండలకు యెంతెంత భిన్నతరములగు ప్రాముఖ్యతలనిచ్చిరో, యిచ్చుచున్నారో, మీకు తెలిసికొనియుందురు. ఇట్టిస్థితిలో, ప్రస్తుత

విశ్వాసములను, ఆచారములను, సాంప్రదాయములను, విమర్శించుటకుగాని, సమర్థించుటకుగాని ప్రతివానికి హక్కు కలిగియున్నపుడు, వానిని నమ్మనివారిని, సహేతువులతో విమర్శించుటకు బదులు, నాస్తికులనియు, తుంతలనియు, మూఢులనియు, కేవలమతావేశముతో, దురహంకార దురభిమానములతో ఊరక దూషించిన ప్రయోజనమేమి? సహేతువులతో విమర్శకుల నెదుర్కొనవలెనుగాని, "ఆడలేక మద్దెల ఓట"న్నట్లు, వారివిమర్శనల నెవరు పాటించెదరనియు, వారికివి యెందుకనియు, వారు ప్రపంచమునంతయు మరమ్మతు చేయగలరాయనియు, చప్పలించు మాటలేమిలాభము? దూషణలతో వ్రాయబడు వ్యాసపరంపరలవలన ప్రయోజనమేమి? సహేతుకవిమర్శనలు, కొందరికైనను తలకెక్కక తప్పవు. విమర్శకున కంతేచాలును. మనము పూర్వసాంప్రదాయకులను యెన్నటికి ఒప్పించలేక పోవచ్చును. కాని అంతమాత్రముచేత విమర్శకులకు లోటువాటిల్లదు.

ఉభయవాదములలో సత్యాసత్యములను గ్రహించి, ప్రజలలోనున్న అనేకమూఢవిశ్వాసములు నశించుటకే యిట్టి మతసాంఘిక రాజకీయ విమర్శనలు కావింప బడుచుండును. వివిధవిషయములలో, క్రమక్రమముగా అనేకమైన యద్భుత మార్పులు జరుగుచుండును. ఒకానొకప్పుడు, రాజకీయ, సాంఘికవిప్లవములు బయలుదేరి, పాలనావిధానములు, మతసాంప్రదాయములు, ఊరు పేరు లేకుండ కొట్టుకొని పోవచ్చును.

సాధారణముగా వానిలో సంస్కారణలనేకములు ప్రవేశించి తీరును. వీనికి విమర్శకులు బెదరరు. ప్రకృతిలోని పరిణామ మెట్లు జరుగుచున్నదో, ఆలాగుననే మానవులలోకూడ నీతి మతపరిణామములు సంభవించుచునే యుండును. మానవుని మెదడునకు తాళము వేయుజూచెదరా? అది అసంభవము. అనేకవేల సంవత్సరములనుండి పారంపర్యముగ ఆచరణలో నుండి, మన రక్తమాంసములతో కలసియున్న మూఢమతా చారవిశ్వాసములు, యెంతకఠిన విమర్శనలకు లోనుగాకుండ సులభముగ మనలను విడుచునా? కావున విమర్శనకాఠిన్యము నకు యెవరును వెఱవనలదు. వ్యక్తిదూషణను పరిత్యజించి, సంస్థల విషయములలో, కొంతకఠినత్వము చూపకతీరదు. మృదుత్వము పనికిరాదనియే నాయభిప్రాయము. అయినను, యీ మృదుత్వకాఠిన్యతలు ఆయావిమర్శకుల సాత్విక, రాజస, తామసగుణములను బట్టియుండును.

---

## 15 వ అ ధ్యా య ము

## ప్ర త్య క్ష ప్ర మా ణ ము

ప్రత్యక్షప్రమాణము నంగీకరించుచు ఒకరి ప్రత్యక్ష ప్రమాణము మరియొకరికి లేకపోయినంతమాత్రమున నొకటి

వారు చెప్పినది సత్యము కాదని వాదించకూడదని కొంద రనెదరు. సమస్త ఆధునిక శాస్త్రములను నేర్చినవారు అరు దైనప్పుడును, ఆయాశాస్త్రవిషయములలో సంవత్సరముల కొలది శ్రమచేసినవా రందరు తమరు కనిపెట్టినవానిని పోల్చి జూచుకొని సంప్రతించి యేకీభవించిన విషయములను మనకు నిదర్శనపూర్వకముగ ప్రత్యక్షప్రమాణములతో చూపించు చున్నపుడును, అవిసరికావనుచు, మరి యెవరో ఒకరు చెప్పినమాట విశ్వసనీయమా? లండనునగరము మనలో ననేకులు చూడకపోయినను భూగోళశాస్త్రజ్ఞులును, అక్కడకు వెళ్లివచ్చినవారును, దానిని ఒకేవిధముగ వర్ణించుచుండగా దాని యునికిని మనము నమ్మట స్వాభావికముగదా! దీని వలెనే స్వర్గనరకముల వర్ణనలు మనము నమ్మవలసినదేనా? వ్యాసమహర్షి ప్రత్యక్షప్రమాణములను మన మలవడజేసికొను వరకు, ఆయున తన పురాణములలో వ్రాసినది మనము నమ్మ వలసినదేనా? ఇతరజాతుల మేధావంతులలో యిప్పటికిని యీాయనకుగల ప్రత్యక్షప్రమాణజ్ఞానము కలుగలేదా? అన్ని జాతులవారికిని యిట్టి విషయములలో యేకాభిప్రాయ మేల లేదు? ఇన్ని మతాభిప్రాయము లేల కలుగవలెను? వీనిలో యెవరిమతము నిజమని దేవుడు శాసించెను? ఇవన్నియు సత్యములని నమ్మచో, యేగ్రంథకర్త యిట్టి పిచ్చియభూత కల్పనలు వ్రాసినను, వారి ప్రత్యక్షజ్ఞానము మనకు లేదనియు, అవి యన్నియు సత్యములై యుండి తీరవలెననియు మనము

మారుమాటాడక నమ్మవలసివచ్చును. నేయి కల్లు పాలు మొదలగు సముద్రములు నిజముగా నున్నవని నమ్మువారును, పర్వతము నూడబెరికి తెచ్చిన కోతి, భూమిని చాపగా చుట్టిన రాక్షసుడు, వేయి బాహువులు గల మానవుడు, పది తలలుగల రాజు, మొదలగు విషయములను నమ్మువారును, ఈ కథలు వ్రాసిన గ్రంథకర్తలకు యివి యన్నియు ప్రత్యక్ష ప్రమాణములే యనియు మనముకూడ వారి అతీంద్రియ జ్ఞానదృష్టి నలవరుచుకొన్న గాని అవి సత్యములు కావని మనము చెప్పకూడదనియు వాదింపవచ్చును గాని కొంచము మెదడుండి ఆలోచించుకొనగలిగిన మనుష్యమాత్రుడు నమ్మ వచ్చునా? అటులైనచో ప్రతి యభూతవిషయమును మనము నమ్మవలసి యుండును.

ప్రకృతిరహస్యములను పరిశీలించి కనిపెట్టిన విషయ ములను బట్టి భౌతికశాస్త్రజ్ఞులు తమ పూర్వపు టూహలను మార్చుకొనుచుండుటలో తప్పేమియు లేదు. వీరి విధానము తప్ప యీ రహస్యములను గ్రహించుటకు మరియొక రాజ మార్గమే లేదు. చూచుట పరీక్షించుటయే దీనికి ప్రధాన ములు. ఈ పరిశోధనలవలననే మనకు వారు ప్రత్యక్షజ్ఞాన మును కలుగజేయుచున్నారు. నేను శ్రుతి స్మృతి పురాణేతి హాసములను విమర్శించుటవలన మన పూర్వులయందు నిరసన భావ మున్నట్లు తలచకూడదు. నేటికి మనకుగలట్టియు, ముందు మనకు కలుగబోవునట్టియు ప్రకృతిజ్ఞాన మంతయు,

మన పూర్వులకు కలదనే యహంభావమే, వారి గ్రంథముల యందు గ్రుడ్డినమ్మకమునకు పునాదియై, వారికి అగౌరవ మును కూడ కలుగజేయుచున్నది. ముప్పదివేల సంవత్సరము లకు ముందు, ప్రపంచములో ఆదిమతగ్రంథమైన ఋగ్వేదము లోనే యీ ప్రకృతియొక్క మూలము హిరణ్యగర్భునికైనను తెలుసునో తెలియదో సందేహమని ఋషులు వ్రాసియుం డగా, దానికి చాలాకాలము తరువాత వెలువడి దానికంటె మిక్కిలి దుర్బలములని ఒప్పుకొనబడిన మంత్రబ్రాహ్మణ సూత్రస్మృతి పురాణాదులలో వ్రాసిన విషయము లన్నియు, ఆ గ్రంథకర్తలకు ప్రత్యక్షప్రమాణములే యని నమ్మట మిక్కిలి హాస్యాస్పదము. ఏమతగ్రంథములోగాని, ఏమాన వునిలోగాని సర్వజ్ఞత్వ మున్నదని ఒప్పుకొనగానే, మన గ్రుడ్డి నమ్మకమున కంతమే లేదు.

లోకములోని మతము లన్నియు కేవలము పౌరు షేయము లనియే యని నమ్మి వానిలోని విషయములను, మన యనుభవ ప్రత్యక్షప్రమాణములనుబట్టి నమ్మచుండ వలెనేగాని వాని నన్నిటిని తూచా తప్పక నమ్మవలసినదని ప్రజలను హెచ్చరించకూడదు.

ప్రతివిషయములోను పెడత్రోవలు త్రొక్కు మేధా వంతులు లేకపోలేదు. ఎంతగొప్పవానికైనను కొన్ని విప రీతాభిప్రాయములు పట్టింపులు పిచ్చినమ్మకము లుండకపోవు.

వారు వానిని త్యజించజాలరు. బహుమంది వివిధభౌతిక శాస్త్రజ్ఞులు యేకగ్రీవముగ నిచ్చు యభిప్రాయములను, వారు చూపించు ప్రత్యక్షప్రమాణములను త్రోసిపుచ్చి, యెవరో ఒక గొప్పశాస్త్రజ్ఞుడు భిన్నాభిప్రాయమును కనుపరచినంత మాత్రమున, అవి యన్నియు అసత్యములని మనము భావింపవచ్చునా? ప్రకృతిశాస్త్రజ్ఞులు యింతవరకు కనిపెట్టినవి సంఘ శైశవదశయందు అతిశయోక్తులతో గ్రంథస్థములైనంత మాత్రమున అవి గ్రంథకర్తల ప్రత్యక్షజ్ఞానములోనే వ్రాయబడెననియు, అవి సత్యములే యనియు వాదించ బూనుట మిక్కిలి సాహసము. అట్లు నమ్ముటకు మొదలుపెట్టినయెడల, యిక నమ్మతగనిదేముండును? వానిలో వ్రాసిన యభూత కల్పనలన్నియు దిగమ్రింగవలసినదే. విమర్శనతో యవసరమేమి? మనబుద్ధి నుపయోగించక, మనోబానిసత్వ మనుభవించవలసి యుందుము. కాబట్టి మొదట సందేహించుటయే జ్ఞానోత్పత్తికి శరణ్యము.

పురాణములలో చెప్పిన ఆకాశములో యుద్ధములు, ఆగ్నేయవారుణవాయువ్యాస్త్రములు మొదలగునవి అతిశయోక్తివర్ణనలేగాని, యిప్పటి ప్రకృతిశాస్త్రజ్ఞానజన్యములని నే నిప్పటికిని అంగీకరింపజాలను. ఒకసారి మానవుడు గ్రహించిన ప్రకృతిరహస్యము యెన్నటికిని నశించదు. అది ప్రపంచ మంతయు వ్యాపించి తీరును. ఒకకాలమందు మన

వారికి గల స్వల్ప ప్రకృతిజ్ఞానము అప్పటి తక్కినజాతులకంటె కొంచ మెక్కుడుగ నుండవచ్చునేమోకాని, గత రెండు శతాబ్దములనుండి ప్రపంచములో వెలువడిన ప్రకృతిజ్ఞానము, యేదేశపు పూర్వీకులకుగాని లేదనియే మనము నమ్మవచ్చును. మన పురాణములలోని అతిశయోక్తివర్ణన లన్నియు, ఊహాప్రపంచములో, గాలిలోను, ఆకాశములోను కట్టిన సౌధములు. ఆ గ్రంథములలో నీతిబోధకములగు విషయములను మనము గ్రహించవచ్చునుగాని, వానిలోని ప్రకృతి పరిణామము, అభూతకల్పనలు మొదలగునవి మనకు విశ్వాసనీయములు కావు. ఇవి యన్నియు మన మతగ్రంథములనియు, వానిలో చెప్పిన వన్నియు, మనము శిరసా వహించవలెననియు, వీనిని చదివిన, వ్రాసిన, వినిన పుణ్యము వచ్చుననియు చెప్పువారు పొరబడుచున్నారని నాయభిప్రాయము. మన బుద్ధి నుపయోగించక ప్రత్యక్షప్రమాణమును సరకుగొనక ప్రాతగ్రంథములలో నున్న దంతయు సత్యమే యని నమ్మవలయునన్నయెడల మన మానవత్వమే నశించును. ఇట్టి నమ్మకముకంటె సంశయించుటే శ్రేయస్కరము, క్షేమకరము. కేవల శబ్ద మెన్నటికిని ప్రమాణము కాదు. లోహాదులయందు కూడ ప్రాణ మున్నదని బోజుగారు వ్రాసినంతమాత్రమున దానిని నమ్మకూడదు. ఆయన దానిని మనకు ప్రత్యక్షమగునట్లు రుజువు చేసి చూపించగలిగినపుడే, మనము నమ్ముచున్నాము. మన తంత్రములు మంత్రములు యోగములు

నట్టివే. వానిచేత ప్రకృతిలో మార్పులు కలిగించి, మనకు చూపించినపుడే వాని కట్టి శక్తి యున్నదని నమ్మవలెను. లేనియెడల వానిని త్రోసి పుచ్చుచుండుటయే మన విధి.

---

## 16 వ అ ధ్యా య ము

## నూతనాద్వైతశిద్ధాంతము

## (Monism)

ప్రకృతియంతయు దేవునిలోనే యున్నదనియు, దేవుడు ప్రకృతియంతయు నిండియున్నాడనియు, నమ్మిన యెడల, యీ ప్రకృతినే, దే వు డ ని పి లు వ వ చ్చు ను. (Pantheism). మనకు కనుపించు యీ ప్రకృతికి భిన్నముగ దేవుడుగాని ఆత్మలుగాని యున్నవని భౌతికశాస్త్రపరిశోధనలవలన యింతవరకును రుజువు కాలేదు. మొదట ఒకటే వస్తువునుండి యీ బ్రహ్మాండమంతయు, దీనిలోని వివిధ స్థావరజంగమ పదార్థములన్నియు క్రమక్రమముగా ఒకదాని నుండి మరియొకటి యుద్భవించెనని ప్రకృతిపరిణామశాస్త్రము (Science of Evolution) రుజువుపరచుచున్నది. మన యీనాటి భౌతికశాస్త్రజ్ఞానము మన పూర్వులకు లేక

పోయినను, కాణాదుని ఆరంభవాదమును, కపిలునిగుణపరి ణామవాదమును కొంతవరకు, పైనచెప్పిన జడాద్వైత వాదమును (Material Monism) బలపరుచును. పర మాత్మ జీవాత్మలు లేవనియు, మానవుడు వంశపారంపర్య గుణవిశేషములు,తనచుట్టునుండుపరిస్థితులు,సాంఘికశిక్షణలను బట్టి, నడచుకొనవలసివచ్చుచున్నది కాని, అతనేపనిచేయుటకు సంపూర్ణచిత్తస్వాతంత్ర్యము (Free will) కలవాడు కాడనియు, యీజడాద్వైతుల యభిప్రాయము. ఐహికము, ఆముష్మికమను వేరువేరు ప్రపంచములు వీరొప్పుకొనరు. ఈ పరిణామవాదములో ఒక చిక్కును విడదీయవలసియున్నది. అన్యోన్యకారణత్వగొలుసులో జడపదార్థమునుండి సజీవత్వ మెట్లు ఉత్పన్నమైనదనే లెక్కము దొరకవలెను. హెకెల్ మొదలగు కొందరు భౌతికశాస్త్రజ్ఞులు కొంతవరకు యీ విష యమై సూక్ష్మపరిశోధలను చేసిరిగాని యీసమస్య యింకను తృప్తికరముగ పరిష్కారము కాలేదు. ఏది యెట్లున్నను, ప్రాణు లకు, ఆత్మ లున్నట్లును, చనిపోయినపుడు, వీరిశరీరములు నశించినను, వీరి యాత్మలు స్థిరముగా మరియొకచోట నుండు నని, యీ నూతనాద్వైతవాదులు ఒప్పుకొనరు. మన మెదడే మనయాత్మ. ఆమెదడులోని వివిధభాగములలో మన మానసిక శక్తులిమిడియున్నవి. వానిలో ఒక భాగమును తీసివేసిన యెడల, దానితో సంబంధించిన శక్తి పోవునని రుజువు చేయ బడినది. ఆ భాగములలో యేదిమైనను రుగ్మతచేత చెడి

నపుడు, ఆ భాగముతో సంబంధించిన మానసికశక్తి తగ్గిపోవు
నని శారీరశాస్త్రజ్ఞులు మనకు ప్రత్యక్షముగ చూపుచున్నారు.
ఈ శాస్త్రము (Pathology of the brain)అని చెప్పెదరు.

ఒకటే పదార్థమునుండి యీ చరాచర సృష్టివికసిం
చుట, తుదకు యీ మానవసృష్టి, క్రింది జంతువులనుండియే
యేర్పడుట, సమస్త జీవములలో, వాని మెదడుయొక్క
క్రమాభివృద్ధి, వాని అస్థిపంజరములపోలిక, పిండోత్పత్తి
విధానము, మొదలగు విషయములలో, పరిణామవాదగ్రహిం
చినమొదల, దేవుడుగాని, ఆత్మగాని, స్వర్గనరకములుగాని,
ఆముష్మికసౌఖ్యములుగాని, జన్మపరంపరలుగాని, వేరుగా
యున్నవని నమ్ముటకెట్టి కారణములు కనుపడవు. వివిధ
దేశప్రజలకు, అనేకవేల సంవత్సరములనుండి పారంపర్యముగ
వచ్చు అలవాటులను వదలలేక, నీతికి పునాదులను తెలిసికొన
లేక, ఆధ్యాత్మికమైనది వేరుగా పైన యెక్కడనో నున్నదని
లేనిపోని భయములనుపెట్టుకొని, అనేక మూఢవిశ్వాసము
లకును, మతసాంప్రదాయకములకును దాసులగుచున్నారు.
ఈ అఖిలాండకోటిబ్రహ్మాండమంతయు ఒకటే పదార్థముతో
(Substance) నిండియున్నది. దీనిలోపదార్థము (Matter)
శక్తి (Energy or Force) యనునవి యున్నవి. ఈ రెండును
ఒకదానిని విడచి ఒకటి యుండనేరదు. ఈ రెంటిలో, యెన్ని
మార్పులు కలిగినను వీనికి హెచ్చుతగ్గులేర్పడవు. జడపదా
ర్థములకు, యింద్రియజ్ఞానము (Sensation) చలనశక్తి

(Movement) ఉండవుగాని, వానిలోని అత్యంతాల్పపరిమాణువుల కూడికలవలన నవి యేర్పడును. ఈ జడప్రపంచము నుగురించి వివరించుశాస్త్రములు—ఖగోళశాస్త్రము (Astronomy), భూగర్భశాస్త్రము (Geology), ఖనిజశాస్త్రము (Mineralogy), ఉదకశాస్త్రము (Hydrology), పదార్థవిజ్ఞానశాస్త్రము (Physics), రసాయనశాస్త్రము (Inorganic Chemistry) మొదలగునవి. జీవాంగములుగలవానినిగురించి వివరించుశాస్త్రములు—వృక్షశాస్త్రము (Botany), జీవశాస్త్రము (Biology) జంతుశాస్త్రము (Zoology)కీటకశాస్త్రము(Entomology), శారీరశాస్త్రము (Physiology) మొదలగునవి. ఈ శాస్త్రములన్నిటిలో అనేక అంతర్భాగములుండి, వీనిలో ఒక్కొక్కశాస్త్రములో తమ జీవితకాలమంతయు పరిశోధనలను చేయుచు ప్రకృతి రహస్యములను కనిపెట్టుచుండు శాస్త్రజ్ఞు లనేకులు బయలు దేరుచున్నారు. భూగర్భశాస్త్రపరిశోధనలనుబట్టి మనకు దొరకిన మృతజంతు కళేబరములను పరీక్షించి, వాని యుత్పత్తి కాలములనుగురించి తెలియుచేయుశాస్త్రము. (Paleontology), పూర్వము కొంతకాలము జీవించి యిప్పుడంతరించిన జంతువుల యొక్కయు, ప్రస్తుతమున్న జంతువులయొక్కయు, అస్థిపంజరములను పోల్చి, వాని సంబంధములను తెలుపు శాస్త్రము (Comparative Anatomy) సమస్త జీవరాసుల పిండోత్పత్తినిగురించిన శాస్త్రము (Embryology),

మానవుని పుట్టుక, క్రమేణ క్రిందజంతువులనుండి ఆఖరుకు తోకలేని కోతులనుండి కలిగినదని నిదర్శనపూర్వకముగ తెలియచేయు శాస్త్రము (Anthropology) యీ మొదలగు శాస్త్రములలో ఓపికతోను, శ్రద్ధతోను వేరువేరుగా పరిశోధనలు చేయుచు, తమతమ తుదినిర్ణయములను సంపుటీకరణము కావించుకొని పోల్చుకొనుచు, సత్యాన్వేషణమే ప్రధానముగ నెంచి, మానవకోటి శ్రేయాభివృద్ధికి పాటుపడుచున్న మేధావంతులగు శాస్త్రజ్ఞులనేకులున్నారు. ప్రకృతి తనలోని రహస్యములను శ్రద్ధాళువులగు ఉపాసకులకుగాని బయటపెట్టదు-ప్రత్యక్ష ప్రమాణముమీదనే ఆధారపడు యీ వివిధ శాస్త్రజ్ఞులు, యిప్పటివరకు జరిగిన పరిశోధనలబట్టి యైనను, మెదడులోనే, ఆత్మ యనుకొనునది యున్నదనియు, ప్రకృతిలోనే దేవుడనుకొనువా డున్నాడనియు జీవాత్మ పరమాత్మలు, మానవులకు ఉత్తరజన్మములు, వేరుగా నొక అధ్యాత్మిక ప్రపంచము, స్వర్గనరకములు మొదలగునవి యేమియు లేవనియు, సిద్ధాంతము చేయుచున్నారు. ఈప్రకృతి శాస్త్రజ్ఞానమంతయు మన పూర్వఋషులకు తెలిసియే, మత గ్రంథములు వ్రాసిరనుట మిక్కిలి హాస్యాస్పదము. శోచనీయము. ఈ కాలపు విద్వాంసులలోకూడ అనేకులు తమ పూర్వ సాంప్రదాయములను విడువలేక, అవివేకులైన మన పూర్వులకు సర్వజ్ఞత్వమారోపించి, వారి యూహాప్రపంచము నంతయు, ఆధునిక శాస్త్రపరిశోధనజన్యప్రపంచముతో

ముడిపెట్టుటకు సాహసించుచున్నారు- ప్రపంచములోని మత ములన్నిటిని త్రోసిపుచ్చి, యీ నూతనాద్వైతశిద్ధాంత ఫలిత ములనే, చిన్నతనమునుండియు, మన పిల్లలకు బోధచేయుట ఆవశ్యకమై యున్నది. వారినైతిక ప్రవర్తనకును, భవిష్యజ్జీవ నమునకును, సరియైన పునాదులను, వారి ఉపాధ్యాయులు వేయవలయును. అసత్యములును, పిట్టకథలను, తమరే నమ్మని విషయములను, వారి కెన్నటికిని బోధించకూడదు. వారే పెద్దవారైనకొలది, సాంఘికశాస్త్రము (Sociology), సృష్టి విషయకశాస్త్రము(Cosmology) మొదలగువానిలోని పరి శోధనలను గురించి తెలిసికొని, వాని కనుగుణ్యముగ నడచు చుందురు. నీతినియమములు, భగవద్భక్తియను నొకదాని మీద యాధారపడవనియు, మానవశ్రేయస్సు నభివృద్ధి నొం దించు సూత్రములే ప్రధానమనియు, వారు క్రమక్రమముగా తెలిసికొనెదరు. మూఢవిశ్వాసములు, పిచ్చినమ్మకములు, నిరర్థ కాచారములు, సాంప్రదాయములు, అనవసరభయములు మొదలగునవి పటాపంచలై పోవును.

---

రు 12000 లకు డిక్లరేషన్ అఫ్ ట్రస్టు దస్తావేజు.

<table>
<tr>
<td>

ఆ 1931 సం॥ యేప్రియల్ 9 వ తారీఖున, పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు రిజస్ట్రేషన్ సబు డిస్ట్రిక్టు, కొవ్వూరు గ్రామకాపురస్తులు బ్రాహ్మణులు, హైకోర్టు అడ్వకేటున్ను లేటు వల్లూరి వెంకటకృష్ణయ్యగారి కొమారుడున్ను నగు వల్లూరి సూర్యనారాయణరావు వ్రాసిన డిక్లరేషన్ అఫ్ ట్రస్టుదస్తావేజు.

1 నా చిరకాలపు స్నేహితుడును, నిర్మల స్వార్థత్యాగముతో చిన్నతనములోనే తన న్యాయవాదవృత్తిని వదలుకొని, సుమారు 15 సంవత్సరములు కష్టించి తన ధనమును, ఆరోగ్యమును తుదకు తన ప్రాణములనుకూడ సర్పించి,

</td>
<td>

Deed of Declaration of Trust executed by Valluri Suryanarayana Rao B.A., B.L., L.T., High Court Advocate, son of Venkatakrishnaiah garu, Brahmin, residing at Kovvur, West Godavari District.

I. Late Tallapragada Suryanarayana Rao garu an old friend of mine, gave up his lucrative practice at the Bar, while still young and with a rare sacrifice of his wealth, health and at last his life itself worked incessantly for 15 years, established a public

</td>
</tr>
</table>

కోవ్వూరు గ్రామములో యేబదివేల రూపాయీల
స్థిరాస్తితో "ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ మను"
నొక సంస్థాపనను నిర్మించినవాడగు లేటు తల్లాప్ర
గడ సూర్యనారాయణరావుగారు ది 6-3-26 తారీ
ఖున శివసాన్నిధ్యమును చేరినారు. ఆయన
నామము ఆచంద్రార్కముగ నుండునట్లు తోడ్ప
డుట నావిధాయక కృత్యమని యెంచి, నాస్వా
ర్జితమగు తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం
తాలూకా ఆలమూరుకోఆపరేటివ్ ల్యాండు
మార్గేజి బాంకులోనున్న నెం 31 టు 42 నెంబ
ర్లుగల పండ్రెండువేల రూపాయీల డిబెంచర్లను
యీ క్రిందిషరతులతో యీక్రింద వివరింపబోవు
విషయములను నెరవేర్చుటకు కోవ్వూరు ఆంధ్రగీ
ర్వాణ విద్యాపీఠ పాలకసంఘమువారిని ట్రస్టీలుగా

charitable Educational Institution called Andhra Girvana Vidyapitham having immovable properties worth about Rs. 50,000 and died on 6th March 1926. I feel it my bounden duty to perpetuate his name for ever in the Andhra Desa, as far as it lies in my power and I therefore hereby endow my twelve thousand rupees worth of Debentures Nos. 31 to 42 both inclusive, now in the Co-operative Land Mortgage Bank at Alamuru, Ramachandrapur Taluk, East Godavari District, as a public trust for the following objects, subject to the following conditions.

యేర్పరచి యీడిక్లరేషన్ అఫ్ట్రస్టు దస్తావేజును వ్రాయుచున్నాను.

2. పైన ఉదహరించిన డిబెంచర్లమీద ప్రతి ఆరుమాసములకు వచ్చువడ్డీని మాత్రమే కోవూరు విద్యాపీఠ పాలకసంఘము ఖర్చుచేయుచుండవలెను గాని, అసలు మొత్తము శాశ్వతమూలనిధిగా, యెల్లకాలముండవలెను. ఈడిబెంచర్లగడువానంతరముకూడ వీనిమీదవచ్చు వడ్డీ తగ్గినను, హెచ్చినను కోఆపరేటివుల్యాండుమార్గేజి బ్యాంకులలోనేయీఅసలు మొత్తము వేయుచుండవలెను. గాని భూములు, యిల్లు మొదలగు స్థిరాస్తులను కొనకూడదు.

3. నేనున్ను, నాయిద్దరు కొమాళ్ళు కృష్ణమోహన్ M. A. B. L. Advocate మద్రాసు

II. The above Debentures should be kept as a permanent fund and the interest alone thereon accruing every six months utilised from time to time. At the expiry of the 20 years period of deposit the corpus should be invested in the Co-operative Land Mortgage Banks alone whatever be the rate of interest payable but not in the purchase of lands, houses or any other kind of immovable property.

III. Myself and my two sons Krishna Mohun, M.A.,B.L. Advocate, Madras and Jogan Mohun, L.E.E., Electrical Engineer,

న్ను, జగన్మోహన్ L. E. E. Electrical Engineer బొంబాయియున్ను కోవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ పాలకసంఘములో జీవితకాలపు మెంబర్లుగా నుండవలెను. ఈముగ్గురులో యెవరైనను అన్యగ్రామములలో నున్నపుడు సదరు విద్యాపీఠ పాలక సంఘకార్యనిర్వాహసంఘ సమావేశములలో పాల్గొని వోట్లువేయుటకును, ఉద్యోగీయులుగా నుండుటకును, వారి యిష్టమువచ్చిన వారిని, మరియొక్కొక్కరిని రాజమహేంద్రవరము,కోవ్వూరు గ్రామస్థులలోనుండి మెంబర్లుగా నామినేటుచేసి, పాలక సంఘ సెక్రటరీకిముందుగా తెలియచేసి, తగినయేర్పాట్లుచేసికొనుటకు అధికారము కలిగియుండురు.

Bombay, should be permanent members for their lives in the Governing Body of the Vidyapitham and during their absence from Kovvur, should have each of them the power to nominate a resident of Rajahmundry or Kovvur to act in their stead both in the General Body's and its executive committee's meetings of the Vidyapitham for the purpose of voting and also acting as office bearers too, if necessary after giving previous intimation to the Secretary or the President of the General Body.

4. పైన ఉదహరించిన ట్రస్టుఫండుమీాద రాగల వడ్డీలోనుంచి నెలకు యిరువది (రు 20) రూపాయల చొప్పున కోవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమున కనుబంధముగా నెలకొల్పబడిన శ్రీవాడ్రేవు జోగాయమ్మ బహద్దరు జమీాందారు గారి కళాశాలాధ్యక్షుని (Principal) గౌరవ భృతి క్రిందనిచ్చుచుండవలెను. ఒక వేళ యీా స్వల్పమొత్తమును తనఖర్చులకు స్వీకరించుటకు ఆయన యిష్టపడని యెడల సదరు కళాశాలలో పరిశోధనకును (research) అధ్యాపకమునకును (teaching) సమర్థుడగు ఒక పండితుని జీతము క్రింద నీయవలయును.

IV. Out of the interest on the above trust fund, a monthly sum of Twenty rupees should be paid as honorarium to the Principal of Vadrevu Jogayamma Bahadur zamindar garu's Kalasala, established as an adjunct to the Andhra Girvana Vidyapitham at Kovvur and in case of his non-acceptance for any reasons of his own, to such Pandit therein as is found useful both for the research work in the Vidyapitham, and also for the teaching work in the Kalasala.

5. పై మొత్తము పోగా మిగిలిన వడ్డీని ఆంధ్రభాషలో సులభశైలిని పండిత పామరులకు

V. The rest of the income should be utilised in getting small books written in easy colloquial Telugu on the following subjects

| | |
|---|---|
| బోధపడునట్లు చిన్న చిన్న గ్రంథములను యీక్రింద నుదహరించిన విషయములలో విద్యార్థులచేత కొద్ది పారితోషిక మిచ్చిగాని, ఉచితముగాగాని, వ్రాయించి అచ్చొత్తించి ఆంధ్ర దేశములోని ముఖ్యమైన గ్రంథాలయములకు ఉచితముగ పంచి పెట్టుటకును, వ్యక్తులకు స్వల్పఖరీదుకు విక్రయించుటకును, విద్యావీర పాలకసంఘమువారు వినియోగించు చుండవలెను. | for the enlightenment of the masses, printed, and distributed gratis among all the important libraries in the Andhra Desa and also sold to individuals for small prices. |
| (ఏ) వేదకాలము నాటినుండి హైందవుల ఆర్యమతములోని శ్రౌతస్మార్త కర్మకాండల జ్ఞానకాండల పరిణామము, ప్రస్తుతము వారిలోనున్న సాంఘికాచారములు, విశ్వాసములు, సాంప్రదాయములు, పట్టింపులు, వర్ణములు, వివాహములు, స్త్రీల విద్యాస్వాతంత్ర్యములు, జ్యోతిషములు, | (a) Critical examination on rationalistic lines of thought of the various religious and social movements in India and of the various customs, beliefs and sentiments prevalent among the common people such as the present petrified caste system, unnatural and artificial relations between the sexes, dogmatic rituals, creeds and ceremonies |

మంత్ర తంత్రములు, దేవతలు, దయ్యములు, వర్జ్యములు, లగ్నములు, శకునములు, గ్రహణములు, మంచి చెడుదినములు, అశుచి, ప్రాయశ్చిత్త ఆచారకాండలు, తద్దినములు, దృష్టిదోష, పంక్తిదోష, అంటుదోష, వాయుదోషములు, సాముద్రికము, రసవాదము మొదలగువానిని గురించి మూఢవిశ్వాసములను సప్రమాణముగ ఖండించి విమర్శించుట.

(బి) షోడశ కర్మలను గురించి ఆంధ్రటీకా తాత్పర్యములతో గ్రంథములను వ్రాయించి అనవసరమని తోచిన కర్మకాండ విభాగములను సంకుచిత పరచి వేదలక్షణ నేర్చుకొని తగు విమర్శన జ్ఞానమును తెలివియుగల పురోహితులను, దేవాలయార్చకులను, అన్నివర్ణములలోను బయలుదేరు

irrational conventions based on creeds and colours etc. opposed to common sense and reason, unnecessary rules of purity and pollution, grotesque forms of idol-worship astrology, palmistry, alchemy, manthra thanthrams, demonology, supernaturalism untouchability, unapproachability, ancestor worship, good and bad days for every daily act etc.

(b) A study of comparative mythology, sociology and ethics now in vogue among the various races of mankind and of the evolution of modern Hindu customs, theological doctrines and supernatural beliefs, dogmatic rituals etc. and the turning out enlightened priesthood in every caste and sect by imparting a true and correct knowledge of the karmakanda and the Gnanakanda.

నష్ట చేయుట, ప్రపంచములో తక్కిన జాతుల మతములు, సాంఘికాచారములు, నీతి, వీని పరిణామములు, మొదలగునవి తెలియజేయుట.

(సి) ఆర్యమతమునుండి బయల్వెడలిన బౌద్ధమతము, జైనమతము, బ్రహ్మసమాజ మతము ఆర్యసమాజ మతము మొదలగు వానిలోని సూత్రములను, తెలియజేసి విమర్శించుట, ప్రపంచములో వ్యాప్తినొందియున్న యితరమతములతో ఆర్యమతమును పోల్చి వానిని గురించి ప్రజలకు బోధించుట.

(డి) మన పూర్వులు రచించిన మానసిక భౌతికశాస్త్రములు, కళలు, అధునిక పరిశోధనలను బట్టి విమర్శించి, వానిలో అవసరమగు మార్పులను జేసి మనదేశీయ పారిభాషిక పదములతో ఆంధ్ర

(c) A critical examination of the offshoots of Aryan religion such as Jainism, Budhism Brahmo samaj, Arya samaj etc., and a comparative study of the other important religious movements in the world.

(d) The bringing up-to-date of the knowledge imbedded in the ancient works on material sciences and arts and psychic researches by getting small text books written in easy Telugu with the old and the newly coined Sanskrit nomenclature.

మములో గ్రంథములను వ్రాయించుట.

(ఇ) గాంధిమహాత్ములవారి సత్యాగ్రహ తత్వములు, వానిలో నిమిడియున్న వేదాంతము, నానారాష్ట్రపరిపాలనావిధానములు, ప్రపంచములో యిదివరకు జరిగిన, యిప్పుడు జరుగుచున్న సమస్త సాంఘిక రాజకీయార్థిక విప్లవములు, ఉద్యమములు, గ్రామ పునర్నిర్మాణము, సహకార, అసహకారోద్యమములు, నానావిధ సమిష్టివాదములు, మొదలగు వానిని గురించి గ్రంథములను ప్రచురించుట.

6. పైన వ్రాసిన విషయములను నిర్భయముగను, నిర్మొగమాటముగను, సత్యము తప్పకుండ సప్రమాణముగ సంపూర్ణ మనస్స్వాతంత్ర్యములతో (Free thought) ఆంధ్రులయెదుట వారి

(e) Diffusion of knowledge of spiritualised politics of Mahatma Gandhi and of the Gandhian philosophy of the political, social and economic revolutions and movements of the world past and present and of the modern systems of political Government such as the various forms of socialism, Co-operative republicanism, social and ethical reconstruction, Trade Unionism, Fascism, Syndicalism, Communism, Bolshevism etc.

VI. The Books on the above subjects should be written impartially, fearlessly with citations of authorities, without the slightest deviation from truth and no book should be priced at more than one rupee. These books should be approved of by me

భాషలో వ్రాయుచుండవలెను. ఏ గ్రంథము గాని రూపాయకంటె హెచ్చు వెలను కలిగియుండ కూడదు. నా జీవితకాలములో నే నంగీకరించిన గ్రంథములనే ప్రచురించవలెను. నాజీవితానంతరము విద్యాపీఠ పాలక సంఘమువారు యిప్పు డేర్పరచు పండితబృందము (Academic Council) చే అంగీకరింపబడిన పిమ్మట ఆసంఘమువారి శాశ్వత సభ్యుల మెజారటీ వారి యామోదమును బడ యనిదే యేగ్రంథముగాని వెలువడకూడదు.

7. నాపైయుద్దేశములను నెరవేర్చుటకు యితరదాతలనేకమంది ట్రస్టుఫండుకు సహాయ పడుదురని నేను నమ్ముచున్నాను. అప్పటి దేశ కాల పరిస్థితులనుబట్టి పైన నేను తెలియజేసిన విషయ ములలో చేసికొనెను యీనిధిమీద వచ్చు వడ్డీని

before publication and after my death by the Academic Council of the Vidyapitham, now to be established and also by the majority of the permanent members of the Vidyapitham.

VII. I hope that many philanthropists that sympathise with the above objects may contribute their mite to this nucleus and thus render this Vidyapitham a unique and progressive Institution in the Andhra Desa. Any how, I consider myself amply rewarded and my soul will rest in peace even if one

అంతగాని కొంతగాని వీలుగోలది ప్రజోపయోగ మునకు వినియోగించవచ్చును. సాలుకు ఒక చిన్న గ్రంథము వెలువడినను నాయాత్మ తృప్తి నొందగలదు.

8. నేనిదివరకు ది 16-5-1928 తేదీని కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమునకు కొవ్వూరులో నాయింటిమీద రిజస్టరుడీడ్డు ద్వారా యేర్పరచిన రు 120 లు వార్షికము యీట్రస్టుడీడ్డు మొత్తములోనే చేరి యున్నందున సదరు చార్జి రద్దు అయినట్లు భావించుకొని యీట్రస్టును ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ పాలక సంఘమువారు అంగీకరించవలెను.

9. ఏ కారణము వలన నయినను నాపై యుద్దేశములను కొవ్వూరు, ఆంధ్రగీర్వాణ విద్యా

book be published in an year, on any of the above mentioned subjects in para V *Supra* according to the necessities of the times.

VIII. On 16—5—1923 I created by a registered deed a charge on my house at Kovvur for payment of Rs. 10 per month towards the salary of the teaching staff in the Vidyapitham, but as that amount is included in that of this trust deed, the Vidyapitham authorities should elect to give up their rights there-under if they accept this trust deed and to free my house from the above charge.

IX. If, for any reason the Governing Body of the Vidyapitham be unable to discharge its functions properly, the Andhra

పీఠ పరిపాలక సంఘమువారు సరిగా నెరవేర్చ జాలనిచో ఆంధ్రవిశ్వ విద్యాలయాధికారులు శివిల్ కోర్టుగుండా యీట్రస్టుఫండును స్వాధీనము చేసికొని దీనిలోనుదహరించిన కార్యవర్గములను సక్రమముగ యీ కోవ్వూరు విద్యాపీఠములోనే నెరవేర్చుచుండవలెను.

ఇది నాసమ్మతిని నా స్వదస్తూరీని వ్రాసియిచ్చిన డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టు దస్తావేజు.

అడ్వకేటు వల్లూరి సూర్యనారాయణరావు,

సెక్రటరీ

ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము

కోవ్వూరు

పశ్చిమ గోదావరిజిల్లా

9—4—31.

University authorities are hereby authorised to get the above trust fund into its own hands through Civil Courts and manage this trust by using only the annual income thereon for the above mentioned objects at Kovvur alone.

I executed this Deed of Declaration of Trust with my free will and consent, on the 9th April 1931, in my own hand writing.

**Valluri Suryanarayana Rao,**

*Advocate, High Court*

AND

*Secretary.*

ANDHRA GIRVANA VIDYAPITHAM,

KOVVUR.

(West Godavari District.)

APPENDIX II

రెండవ అనుబంధము.

—: వ్రాయతగిన కొన్ని విషయముల పట్టిక :—

1. వర్ణములు. 2. అంతర్వర్ణ, అంతర్జాతీయ వివాహములు 3. వితంతు, రజస్వలానంతర వివాహములు—3. వావి 4. వివాహచ్ఛేదనము. 5. స్త్రీలవిద్యా స్వాతంత్ర్యములు. 6. ప్రకృతి పరిణామము. 7. మతపరిణామము. 8. నీతి పరిణామము. 9. నీతిమత సంబంధము. 10. విగ్రహారాధనము. 11. పితృపూజ. 12. ఆర్యబ్రాహ్మణ మతములు. 13. పునర్జన్మ. 14. స్వర్గనరకములు. 15. దేవుళ్లు దయ్యములు. 16. దైవప్రార్థనము. 17. పురాణములు. 18. హైందవ ధర్మశాస్త్రకాలనిర్ణయము. 19. దైవస్వరూప పరిణామము. 20. అవతారములు. 21. ఆత్మస్వరూప పరిణామము. 22. మంత్రతంత్రములు. 23. కర్మజ్ఞాన భక్తి మార్గములు. 24. యోగవిద్య. 25. దృష్టిపంక్తి అంటు వాయుదోషములు. 26. మంచిచెడు దినములు. 27. శకునములు, వర్జములు, లగ్నములు. 28. జ్యోతిషము. 29. యజ్ఞములు, యాగములు. 30. శుద్ధాద్వైత జడాద్వైతములు. 31. అహింస, జీవహింస. 32. ఆత్మహత్య. 33. విశ్వాస సంశయమాత్మ తత్వములు. 34. దానధర్మములు. 35. అపక్వశాకాహారము. 36. సమిష్టివాదములు. 37. మహాత్మ గాంధిగారి సత్యాగ్రహ తత్వము. 38. రాజకీయ, సాంఘిక విప్లవములు. 39. భౌతిక శాస్త్రములు. 40. బాలుర విద్యా విధానము.

ఈ క్రిందిగ్రంథములు, పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ మేనేజరు కందుకూరి వీరబసవరాజు గారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

1. వర్ణాశ్రమ ధర్మపరిణామము 8 [illegible]
2. అంతర్జాతీయ ధర్మశాస్త్రము 6 [illegible]
3. మనస్స్వాతంత్ర్యము 8 [illegible]

వల్లూరి సూర్యనారాయణరావు
సెక్రటరీ
ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము
కొవ్వూరు
పశ్చిమగోదావరిజిల్లా

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారిచే రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రింపఁబడియె. 7212_1932_1000